రి 1984

# సృజన

ఈ విప్లవాగ్నులు ఎచటివని అడిగితే
శ్రీకాకుళం వైపు చూడమని చెప్పాలి
వెంపటాపు సత్యమెవ్వరని అడిగినా
గిరిజనులె సత్యమని గొప్పగా చెప్పాలి
సత్యమే విప్లవము - విప్లవమే సత్యమని
విప్లవము సత్యము ఒకటనే చెప్పాలి
ఎర్రజెండా ఇంత ఎరుపేమిటని అడుగ
సత్యం రక్తంతో తడిసెనని చెప్పాలి

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

147 మాసపత్రిక జనవరి 1984



SRJANA is recommended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh, Hyd. Vide Ref. No. 182/A4/67, dated 22-9-67

Printed, Edited & Published by P. Hemalatha for 'Sahithee Mithrulu' Printed at Vijay Art Printers, Chikkadpally, Hyderabad-500 020 for Venkataramana Mudranalayam, Warangal, Working Editor: VARAVARA RAO.

# ప్రజల తీర్పు?!

ప్రజల వనరుల్ను, కష్టాన్ని, సంపదను కొల్లగొట్టి దోచుకుంటున్నట్లుగానే దోపిడీ వర్గాలు ప్రజల భాషా సంస్కృతులను కూడ దోచుకుంటాయి. ప్రజలు హృదయానికి ఎంతో దగ్గరగా ప్రేమగా పిలుచుకునే పేరును శత్రువునోట వినాల్సి వచ్చినప్పుడు అవాక్కయిపోతాం. భగత్‌సింగ్ తల్లిదగ్గర కూచొని ఇందిరా గాంధీ "మా(" (అమ్మ) అంటే యువకుల హృదయాలు ఎంత భగ్గున మండి పోతాయో! "భగత్‌సింగ్ వారసులమ"నే ఎబివిపి జ్ఞానానికి చరిత్ర ఎంత వినమ్రమవుతుందో।

బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని ఖుషామత్ చేయడానికి ఫ్యూడల్ ప్రభువులు విడగొట్టిన నైజాం రాజ్యంలో ప్రజల్ని పులకింపజేసిన భావన "ముక్కోటి తెలుగులు ఒక్కటై" పోవాలన్నది. ఆంధ్రమహాసభనుంచి కమ్యూనిస్టుపార్టీ నాయకత్వానికి ఎదిగేవరకూ అదే "విశాలాంధ్రలో ప్రజారాజ్య"భావనగా పరిణతి చెందింది. ఆ ఆశయ సాధనకోసం రెండు దశాబ్దాలకుపైగా తెలుగు ప్రజలు ఎన్నో పోరాటాలు, మరెన్నోత్యాగాలు చేశారు. తెలంగాణ విమోచన కోసం సాయుధంగా పోరాడారు. విశాలాంధ్ర సాధన కోసం విస్తృతమైన ఉద్యమాలు నిర్మించారు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది. కాంగ్రెస్‌పాలనలో అంధేరాప్రదేశ్‌గా స్థిరపడింది.

"తెలుగుదేశం" పాలకపక్షమైతే జిలుగు వెలుగుల తెలుగుతల్లిని కమ్మిన ఈ అంధకారాన్ని పటాపంచలు చేసి అన్నిరంగాల్లో తెలుగుభాషకు అగ్రస్థానం కల్పిస్తుంది" (తెలుగుదేశం ప్రణాళిక పే.5) అంటూ "తెలుగుదేశం" రాష్ట్ర సర్వతోముఖాభివృద్ధికోసం రూపొందించిన వెలుగు మార్గం ఈ ప్రణాళిక అని ప్రకటించుకున్నాడు "అన్న".

తెలుగుదేశం - తెలుగు ప్రజలకు, ముఖ్యంగా జాతుల సర్వతోముఖాభివృద్ధిని కోరుకునే తెలుగుప్రజలకు ఎంతో ఇష్టమైన పేరు. ఇపుడిది ఒక పార్టీ పేరయి పోయింది. ఏడాదికింద ఎవరికెన్ని ఆశలు పెట్టిందో కానీ ఇప్పుడిది ఆడియాశలకే కాదు, పేరాశకు మారుపేరయింది. ఈపార్టీ పెట్టిన ఎన్టీరామారావు తెలంగాణలో ప్రజలు ఎంతో ఆప్యాయంగా పిలుచుకునే "అన్న" సంబోధనను అపహరించాడు. (సినిమాల్లో "గురూ" అనిపించుకునే గిరీశం సంస్కృతి-అతని కథే అడ్డం తిరిగి తెలుగు సంస్కృతికి అడ్డంపడింది).

అ నుంచి "అమ్మ" నేర్చుకోబోతే ఇందిరమ్మ గుర్తు కొచ్చినా, అన్న
నేర్చుకోబోయి "గురూ"గారు గుర్తుకొచ్చినా నాభినుంచి వచ్చేమాట నాలుక దగ్గర
ఆగి పోతుంది. మనమాటలు మనవి కాకుండా పోతాయి.

స్పెయిన్ అంతర్యుద్ధం మొదలు చైనా విప్లవం వరకు నెహ్రూ నేర్చు
కున్న మాటలు, ఇందిరమ్మకు నేర్పిన మాటలు కరాచీ కాంగ్రెస్‌నుంచి కలకత్తా
కాంగ్రెస్(కలకత్తా కాంగ్రెస్ఐ సభలకు ఆహ్వానసంఘ అధ్యక్షుడు జ్యోతిబసు!)
వరకు కమ్యూనిస్టులను ఒకటిని రెండుగాచేసి (డైలెక్టిక్స్!) "కుడిఎడమయితే
పొరపాటు లేదోయ్ ఓడిపోలేదోయ్" అని ఎన్నికల సమీక్షా మిథ్యావాదంలోకి
నెట్టివేసాయి.

సినిమావల్ల, "ఈనాడు" వల్ల ఎన్టీఆర్‌కు అలవడిన తుంగభద్రా
ఉత్తుంగతరంగాల గర్జాంరవళి (కమ్యూనిస్టుపార్టీ వ్యాపార సంస్కృతికి పెట్టిన
భిక్ష!) చెవులకు హోరై, కళ్ళకు పొరయి, మనసుకు పరమయి అనుభ
వానికి నీటి మూటయింది.

"నాగరిక సమాజంలో ప్రజాస్వామ్యానికి ఉన్నత స్థానముంది. మన
దేశంలోని అన్ని పార్టీలూ ప్రజాస్వామ్యానికి కట్టుబడిఉన్నట్టు ఘోషిస్తున్నాయి.
అయితే అధికారంలోకి రాగానే ప్రజాస్వామ్య విధానాలకు పరిమితులు విధించ
టం పరిపాటి అయింది. ఏదో ఒక విధంగా అధికారంలో కొనసాగడమే పరమా
వధిగా తలచేవారూ, అనువంశిక పాలనకు (కూతుళ్ళకివ్వదలచుకున్న ఆస్తి
హక్కువల్ల అనువంశికమనే మాట కొడుకుల నుంచి అల్లుళ్ళదాక విస్త
రిస్తుంది-సం.) బాటలు వేసేవాళ్ళూ ప్రజాస్వామాన్ని సమాధి చేయడానికి ఎలా
ఉద్యుక్తమవుతారో...." ఇందిరా కాంగ్రెస్ పాలన మాత్రమేకాదు. ప్రథమ
వార్షిక నివేదిక సమర్పణ నాటికి ఎన్టీఆర్ పాలన కూడ నిరూపిస్తోంది.

ఆస్తి సముపార్జించిన వాడికి, అది ముఖ్యంగా అన్యాయార్జితమైనపుడు
ఆ ఆస్తే సంకెలగా మారుతుంది. అవసరంకన్న ఎక్కువ ఆహారం తీసుకుంటేనే
అరగని జీవప్రవృత్తికి ప్రజల రక్తమాంసాలు హరించి. హరాయించుకోవడం
సాధ్యమయ్యేపనికాదు. మాటలు ఆలోచనల నుంచి, ఆలోచనలు ఆచరణనుంచి
కాక ప్రాంప్టింగ్ వల్ల, యాక్టింగ్‌వల్ల, అలవాటు చొప్పున వస్తే మనకవి ఒక
దీర్ఘకాలిక దుర్మార్గపాలననుంచి కలిగిన విసుగు, అసంతృప్తి, కోపం, కసి
అసహాయతలవల్ల, కొత్తగానూ, హుషారుగానూ, నిషానిచ్చి, ఊపు నివ్వ
వచ్చును గానీ ఎంతో విలువైన, బరువైన మాటలు తమతమ అర్థాలు కోల్పోయి
సప్పుడు ఎంతదొల్లగా మళ్ళీమనం ఉచ్చరించడానికి కూడా భయపడి సంకో

చించేవిగా చప్పబడిపోతాయో ఎన్టీఆర్ ఏడాది పరిపాలనకు శిలాశాసనాలుగా ఇక్కడ చదువుకోవచ్చు.

"ప్రజాస్వామ్య ప్రియులందరికీ తీవ్రఆందోళన కలుగుతున్న ఈ తరుణంలో (83 జనవరి 5 కన్న ముందు-సం) "తెలుగుదేశం" తన శాయ శక్తులా ప్రజాస్వామ్యాన్ని పరిరక్షించడానికి దీక్షబూనుతున్నది. ప్రజాస్వామ్య విలువలను, సంప్రదాయాలను అన్ని సందర్భాల్లో, అన్ని వ్యవహారాల్లోనూ పాటిస్తానని "తెలుగుదేశం" శపథం చేస్తున్నది. సామాన్యపౌరుడు అనుభ వించే స్వేచ్ఛే ప్రజాస్వామ్యానికి గీటురాయి. వ్యక్తి స్వాతంత్ర్యం మృగ్య మైన నాడు ప్రజాస్వామ్యం మనజాలదు. అందుకే పౌరులందరూ నాగరిక సమాజంలో ఉండవలసిన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను నిర్నిబంధంగా అనుభ వించేలా చేయడానికి "తెలుగు దేశం" నిర్విరామంగా కృషిచేస్తుంది. రాజ్యాంగం ప్రసాదించిన వ్యక్తిగత స్వేచ్ఛలను కుదించే ప్రయత్నాలను "తెలుగు దేశం" ఎట్టి పరిస్థితుల్లోనూ చేయదు. ప్రజల హక్కులను హరించే నాసా, ఎస్మావంటి క్రూర శాసనాలు కేంద్రం ఉపసంహరించేట్టు చేయడానికి "తెలుగుదేశం" పోరాడుతుంది. ప్రజాస్వామ్య విరుద్ధమైన ఇటువంటి చట్టాలను "తెలుగుదేశం" ఎట్టి పరిస్థితిలోనూ ప్రవేశ పెట్టబోదని ప్రజలకు హామీ ఇస్తోంది...." (తెలుగు దేశం ప్రణాళిక పే. 30).

"....రాజ్యాంగం నిర్దేశించిన ప్రాథమిక హక్కులను ఉల్లంఘించడానికి కూడ అధికారంలో ఉన్నవారు వెనుకాడటం లేదు. ప్రజాస్వామ్యానికి మూల స్తంభాలను పెకలించి వేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.... ప్రభుత్వ యంత్రాంగం అధికారపార్టీకి కట్టుబానిస అయింది. శాసనసభలు అపహాస్యం పాలైనాయి (ఇప్పుడు అపహాస్యం పాలవడానికైనా కనీసం శాసనసభ సమా వేశం కావడం లేదు-సం.) ఇప్పుడు పత్రికాస్వేచ్ఛను కూడ హరించి (వరంగల్‌లో రాడికల్స్ కరపత్రాలు కూడ చేయవద్దని ప్రింటింగ్ ప్రెస్‌లను బెదిరించి-సం.) ప్రజాస్వామ్య ధ్వంస రచనను పూర్తిచేయడానికి పాలకులు సంకల్పించారు. జాతీయ భద్రతాచట్టం (నాసా), అత్యవసర సర్వీసులనిర్వహణ చట్టం (ఎస్మా) వంటి కిరాతక శాసనాలే ఇందుకు తార్కాణం. (వెంకన్న వంటి రైతుకూలీ సంఘంనాయకులను, రఫూఫ్‌లాంటి విప్లవపార్టీ నాయకులను, ఎందరో కార్మిక నాయకులను నిష్కారణంగా నిర్బంధించడానికి ఎన్టీఆర్ ఈ "కిరాతక శాసనాలనే" ఆశ్రయించాల్సి వస్తున్నది-సం.)

అయితే మాటల్లో ఇటువంటి శిలాశాసనాలు "అన్న" మాత్రమే కాదు, అశోకుడు మొదలుకొని అంబేడ్కర్ వరకు "ధమ్మపథా"ల నుంచి ఆదేశిక సూత్రాల వరకు అక్షరాల్లో నిక్షేపించిన వాళ్ళే.

మానవ సమాజానికంతటికీ చెందవలసిన ఉత్పత్తిని, ఉత్పత్తి సాధనాలనూ కైవసం చేసుకున్నట్లుగానే వర్గ సమాజంలో పాలకవర్గాలు, వర్గపోరాట క్రమంలో ప్రజలు సృజనాత్మకంగా రూపొందించుకున్న భాషా వ్యక్తీకరణలను కూడ కైవసం చేసుకుంటాయి. అందుకే విప్లవక్రమంలో పాలక వర్గాలపై ప్రజలు యుద్ధం ప్రకటించినపుడు ప్రజల సంపదలన్నీ పాలకవర్గాల చేతుల్లో ఉంటాయి గనుక ప్రజలు ప్రజల ఆస్తినే ధ్వంసం చేస్తున్నట్లు అనిపిస్తుంది. పోలీసు ఏజెంటునో, గూండానో, డ్యూటీలో ఉన్న పోలీసునో చంపినపుడు పేదల పక్షపాతులు పేదల్నే చంపుతున్నారని ప్రచారం చేయడానికి సాకుదొరుకుతుంది. (అప్పుడు కౌరవుల పక్షం ఉన్నందుకు భీష్మ, ద్రోణ, కృపాశ్వత్థామలే చావవలసి వచ్చిందని మనం సౌకర్యార్థం మరిచి పోతాం.)

అయితే విప్లవక్రమంలో ప్రజలు శత్రువుచేతజిక్కిన తమ శ్రమను, వనర్లను, పనిముట్లను, ఆయుధాలను, మళ్ళీ స్వాధీనం చేసుకుంటూనే కొత్త సృష్టిని, కొత్తవనర్లను, కొత్తపనిముట్లను, కొత్త ఆయుధాలను తయారు చేసుకుంటారు. అట్లే కొత్త మాటలూ సృష్టించుకుంటారు.

"ప్రజాస్వామ్యం" ఇందిర మొదలు ఎన్టీఆర్ వరకు చిలుక పలుకయితే ఆచరణలో పోలీసురాజ్యం అయితే విప్లవ ప్రజానీకానికి నూతన ప్రజాస్వామిక విప్లవం లక్ష్యం అవుతుంది. నక్సల్బరీ, శ్రీకాకుళాలు ఆ లక్ష్యానికి సంకేతాలవుతాయి. శ్రీశ్రీ అన్నట్లు డిక్షనరీ లోకేకాదు కోట్లాది ప్రజల హృదయాల్లోకి "నక్సలైటు" అనే కొత్తమాట వచ్చి చేరుతుంది. "శ్రీకాకుళం చీపురుపుల్లలతో రాద"ని ప్రారంభించిన సాయుధ పోరాటాన్ని తాత్కాలిక అపజయానికి అదిరి, ఎవరైనా చీపురుపల్లిలకు బలిపెడితే సహించని "రాడికల్స్" తరం కూడ సమాజంలోనూ, సాహిత్యంలోనూ శిరమెత్తుతుంది. ఒక నూతన సంస్కృతి ఆవిష్కరింపబడుతుంది. ఒక నూతన మానవుడు ఆవిర్భవిస్తాడు. స్టేడియమ్‌లోకాదు గ్రామాల విముక్తిలో, సదస్సులోకాదు జీవనసంగ్రామంలో. మాటల గారడీలోకాదు మానవచైతన్యంలో. ఆ గుణాత్మక మార్పుపేరే శ్రీకాకుళం.

జనవరి 6, 84 —సంపాదకుడు

# శ్రీకాకుళ ఉద్యమ సాహిత్యం

"తూర్పులోని కొండలన్నీ
జేవురించి ఎర్రబారె
అరుణోదయ కాంతులీనె
అంధకార మరుగసాగె" అని అక్టోబర్ 1968లో ప్రచురితమైన ఒక గేయ సంపుటిలో ఒక కవి ఒక ఆశావహగీతం వినిపించాడు. అప్పటికి తూర్పు కొండల గురించి రాష్ట్రానికి తెలిసింది చాల తక్కువ. తెలుగుదేశానికి తూర్పుకొసన శ్రీకాకుళం అనే ఒక జిల్లా ఉన్నదనేగాని అక్కడి జనం సంగతీ, ఆ జనం జీవన పరిస్థితుల సంగతీ మిగతా రాష్ట్రానికి చాల తక్కువ తెలుసు. ప్రభుత్వానికి కూడ శ్రీకాకుళం గురించి అక్కడ అరుణోదయ కాంతులీనుతున్నప్పుడే తెలిసి వచ్చింది. ఈ అరుణోదయ క్రాంతులను విస్తరింపజేయడానికి, దేశం ఆకాశం మీద ప్రతిఫలింపజేయడానికి ఉద్యమ కారులకూ ప్రచార రూపాల అవసరం వచ్చింది. ఉద్యమాన్ని అణచి వేయడానికి పాలక వర్గాలకు నిర్బంధమూ, అబద్ధ ప్రచార రూపాలూ అవసరం వచ్చాయి. ఈ నేపథ్యంలో వెలువడిందే శ్రీకాకుళ ఉద్యమ సాహిత్యం.

శ్రీకాకుళ ఉద్యమం తనకంటెముందు తెలుగునేల మీద సాగిన ప్రజా ఉద్యమాలన్నిటికన్న గుణాత్మకంగా భిన్నమైనది. ఈ అంశం సాహిత్య రంగంలో ప్రస్ఫుటంగా కనబడుతుంది. శ్రీకాకుళ ఉద్యమం సృష్టించిన సాహిత్యం తెలుగు సాహిత్యంలో ఒక అభివృద్ధికరమైన పరిణామాన్ని రికార్డ్ చేసింది. అదిఅప్పటికప్పుడు కలిగించిన సాహిత్యసంచలనంతోపాటు, తెలుగు సాహిత్య చరిత్రలో సదా వెలుగు ఎర్రజ్యోతిగా నిలిచిపోయింది. తెలంగాణ విమోచనోద్యమ ప్రకాశాన్ని కూడ మరొక్కసారి తెలుగు జన జీవితంలోకి ప్రసరింపజేసింది శ్రీకాకుళమే.

ఈ అంశానికే ఇంకొక బలమైన సూచిక కూడ ఉంది. శ్రీకాకుళ ఉద్యమంకన్న ముందరి ప్రజా ఉద్యమాలు తమకై తాము సాహిత్య ఉద్యమాలను సృష్టించలేదు, కొనసాగుతున్న ఉద్యమాలకు ఊపునిచ్చాయి, కొత్త సాంప్రదాయాల్ని ప్రవేశపెట్టాయి. శ్రీకాకుళఉద్యమం తనకై తాను ఒక విప్లవ సాహిత్యోద్యమాన్ని సృష్టించింది. అంతేకాక ఆ సాహిత్యోద్యమానికి ఒక

నిర్మాణ రూపాన్నిచ్చింది. ఈ పరిణామాన్ని రాజకీయ రంగంలో చూస్తే శ్రీకాకుళం ఉద్యమానికి ముందు సాగుతున్న ఉద్యమంలోకి పార్టీ రావడమో, పార్టీ వచ్చాక ఉద్యమం ప్రారంభం కావడమో జరిగింది, గాని శ్రీకాకుళంలో మాత్రం ప్రజా ఉద్యమంపార్టీ ఆవిర్భావానికి దారి తీసింది. రాజకీయ రంగంలోని ఈ పరిణామమే సాహిత్యరంగంలోకూడ ప్రతిఫలించింది. తెలుగుసాహిత్య చరిత్రకు సంబంధించి తెలుగుదేశంలోనే సాగిన ఉద్యమం ఒక సాహిత్యోద్యమానికి దారితీయడం ఇదే మొదటిసారి. అందువల్లనే తెలుగు సాహిత్య చరిత్రలో శ్రీకాకుళఉద్యమానికి చెరగని ముద్రఉంది.

శ్రీకాకుళ విప్లవోద్యమం మొత్తంలో ప్రధానంగా రెండు దశలున్నాయి. 1958 నుండి 1968 దాకా సాగిన గిరిజనోద్యమ దశ. 1968 నుంచి 1971 దాకా సాగిన విప్లవోద్యమ దశ. గిరిజనోద్యమం అనివార్యంగా, సహజంగా విప్లవోద్యమంలోకి ఎదగడంవల్ల ఈ రెండు దశల విభజన అంత స్పష్టంగా కనబడదు. "....ఓట్లప్పుడు జెండాలుచ్చుకుని పాటలు పాడితే, పాటలకి ఓట్లెవడిస్తాడని ఒదిలీసేసు. మీటింగులెట్టి, గొంతుకలు చించుకున్నట్టరిస్తే పిచ్చిముండాకొడుకులు సారాకీ నోట్లకీ ఓట్లొస్తాయిగాని మీటింగులకీ ఊరేగింపులకీ ఓట్లు రావని చెప్పి ఉపేక్షచేసేసు. మహాజరు కాయిదా లెట్టిన్నాడు మా ఆఫీసర్లే చూడాలగదా అని; ఆకలియాత్ర నడిపించిన్నాడు అల్లంజికొడుకులే మాడిపోయి సస్తారు గదా అని చూసీ చూడనట్టు ఒదిలీసేసు. ఆ ఒదల్డంవే కొంపమీదికొచ్చి పడింది. ఇక వొదల్టానికెంత మాత్రమూ వీల్లేదు. ఏకుమేకై పోయింది. మేకు బాకై పోకుండ చూసోకోవాల !...." అని ఈ ఎదుగుదలను భూషణం "అడివంటుకుంది" కథలో సత్తియ్య షావుకారి గుర్తించాడు.

శ్రీకాకుళంజిల్లా కొండప్రాంతంలో ముఖ్యంగా మూడుతెగల గిరిజనులు నివసిస్తారు. కొండదొరలు, జాతాపు, సవర అనే తెగల్లో సవరలు చాల వెనుకబడినవారు. ఈ ప్రాంతంలోకి వ్యాపారం పేరు మీద వచ్చిన షావుకార్లు ప్రజలను విపరీతంగా దోపిడీచేస్తూ పంటలు, పశువులు, భూములు, సమస్త ఆస్తులు చేజిక్కించుకున్నారు. గిరిజన ప్రజానీకాన్ని బానిసలుగా, ఉపయోగించుకుంటూ, తమ దగ్గర పాలేర్లుగా, కూలీలుగా ఉంచుకుంటూ వీళ్ళు ఏజెన్సీ

జమీందార్లుగా తయారయ్యారు. వీళ్ళకితోడు ఫారెస్టు డిపార్టుమెంట్ ఉద్యోగులు గిరిజనుల దోపిడీని తీవ్రతరం చేసే సరికొత్త జమీందార్లయ్యారు. జనం ఈ స్థితిలో ఉన్నసమయంలో పాలకొండ ఏజెన్సీలో మండఅనే గ్రామంలో పల్లె రాములు అనే ఉపాధ్యాయుడు జనాన్ని సమీకరించి దోపిడీకి వ్యతిరేకంగా తిరుగబడేట్టు చేశాడు. ఈ తిరుగుబాటు వల్ల కక్షతో ఆయనను మొండెంఖల్ గ్రామానికి బదిలీ చేశారు. మొండెంఖల్ సమీపంలోని కొండబారిడిలో ఉపాధ్యాయుడుగాఉన్న వెంకటాపుసత్యనారాయణతో ఆయనకుసంబంధాలుఏర్పడ్డాయి. ఇక ఈ ఇద్దరూ కలిసి గిరిజనగ్రామాలలో సంఘనిర్మాణానికి పూనుకున్నారు. ఆ దశలో "ప్రజలకు ప్రధానశత్రువులైన వడ్డీ వ్యాపారస్తులను, ఫారెస్టు ఉద్యోగులను, ప్రతిఘటించాలని నిర్ణయం చేసుకొని ప్రజలకు పిలుపు ఇవ్వడం జరిగింది." ఈ పిలుపుకు చాల విస్తృతమైన ప్రతిస్పందనవచ్చింది. వెంపటాపు సత్యం రాసినట్టు ప్రజలు "వారి జీవితంలో ఒక నూతన మార్పు వస్తుందని భావించారు. సంఘం మీద విశ్వాసం ఎక్కువైంది....". ఈ స్థాయి నుంచి ఉద్యమం పై స్థాయికి ఎదగక తప్పనిస్థితి వచ్చింది. అందువల్లనే "....వడ్డీ వ్యాపారస్తులను, ఫారెస్టువాళ్ళనే కాక దోపిడీదారులందరినీ గ్రామాలకు వచ్చిన నిర్బంధించి తగిన బుద్ధి చెప్పాలని నిర్ణయించడం జరిగింది." ఇక అక్కడ్నించి ఉద్యమం భూమి సమస్యవైపు మళ్ళింది. 1960 నవంబర్‌లో "వంద గ్రామాలలో వేలాది ఎకరాల" పంటపొలాలు కోసుకొని పంచుకున్నారు. భూమి సమస్య చేపట్టడంతో ఉద్యమం చాల మిలిటెంట్‌గా మారింది. ఈ మిలిటెంట్ పోరాటాన్ని నాయకత్వం, ముఖ్యంగా జిల్లా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం నీరు గార్చింది. "పంటల స్వాధీన కార్యక్రమం ఆపుచేయించి, కూలీరేట్ల పెంపుదల కార్యక్రమం చేపట్టించి, భూ సమస్యపై లేచిన ప్రజానీకాన్ని కూలీరేట్ల ఉద్యమంగా మరల్చారు" అంటాడు సత్యం. ఐతే ప్రజానీకపు క్రియాశీలాన్ని అంత సులభంగా జోకొట్టడం సాధ్యంకాదు. గిరిజన ప్రజానీకం పంటల స్వాధీనాన్ని కొనసాగిస్తూనే వచ్చారు. ఈ ప్రజానీకాన్ని బెదిరించడానికై భూస్వాములు వెంపటాపు సత్యంను, ఆదిభట్ల కైలాసంను, పెదకర్జ, మొండెంఖల్, నీలకంఠాపురం తదితర గ్రామాల సంఘ ముఖ్యులను అరెస్టుచేయించారు. ఈ దశలో పల్లె రాములు ఉద్యమం నుంచి తప్పుకొని భూస్వాములకు లొంగి

పోయాడు. భూస్వాములు ఒకపక్క కూలిరేట్లు పెంచినట్టు నటించి, మరో పక్క వందలాదిమంది గిరిజనుల్ని అరెస్టు చేయించారు. ఈ నిర్బంధంమధ్య నుంచి ఉద్యమం అనివార్యంగా సంఘటితపడే దశకు ఎదిగింది. అంతకుముందే నిర్మాణమై ఉన్న సంఘాలు మరింత పటిష్టం చేయడం జరిగింది. మొండెంఖల్‌లో పదివేలమంది గిరిజన ప్రజానీకంతో గిరిజన మహాసభ జరిగింది. సత్యం అధ్యక్షుడుగా, కైలాసం కార్యదర్శిగా ఏర్పడిన గిరిజన కమిటీ "1961 నుండి 1966 వరకు ప్రతి సంవత్సరం ఆర్థిక పోరాటాలను నడిపింది". ఈ కాలంలో భూసమస్యపై రైతాంగాన్ని కేంద్రీకరింపజేయకుండా కూలిరేట్ల పైననే దృష్టి ఉంచారు. 1962లో 25 రూపాయలుగాఉన్న కూలిరేటు 1966కు 70 రూపాయలకు పెంచుకున్నారు. "ఈ ఆర్థిక పోరాటకాలంలో రైతాంగం సాధించిన అద్భుత విజయాలు అత్యున్నతమైనవి. ప్రజాసైన్యంలేని రాజ్యాంగ యంత్రాన్ని ఏర్పాటు చేశారు." అని సత్యం రాశాడు. ఈ అద్భుత విజయాలలో "కూలిరేట్లు, పాలేర్ల జీతాల అభివృద్ధి", "అధిక వడ్డీలు రూపుమాపుట"నుంచి "గిరిజనుల సంస్కృతిని అభివృద్ధిచేయుట", "మూఢనమ్మకాలను తొలగించుట" వరకూ ఉన్నాయి. ఆకాలంలో పార్వతీపురం, పాలకొండ ప్రాంతాలలో సుమారు 300 గ్రామాలలో గ్రామ కమిటీలు ఏర్పడ్డాయి. తాలూకా కమిటీలూ, జిల్లా కమిటీ ఏర్పాటయ్యాయి. ఈ నిర్మాణమూ, మిలిటెన్సీ నక్సల్బరీ నేపథ్యంలో చాల సహజంగా సాయుధ పోరాటంగా ఎదిగాయి. 1967 అక్టోబర్ 31న మొండెంఖల్ గ్రామంలో ఐదవ గిరిజన మహాసభ జరిగింది. అప్పటికే సత్యం రహస్య జీవితంలో ఉన్నాడు. ఈ సభ నుంచి తిరిగి వెళ్తున్న జనంమీద లేవిడి వద్ద భూస్వాములు కాల్పులు జరిపారు. ఆరికె కోరన్న, బిడ్డిక మంగన్న అనే ఇద్దరు గిరిజనులు చనిపోయారు. దాదాపు ఈ దశలోనే ఉద్యమం మొదటిస్థాయి నుంచి రెండో స్థాయికి ఎదిగింది. గిరిజన ప్రాంతమంతటా దశ నిర్మాణం మొదలైంది. పంటల స్వాధీనం మొదలైంది. భూస్వాముల ఆస్తుల జప్తు మొదలైంది. 1968 జనవరి నుంచి పోలీసు నిర్బంధం ప్రారంభమైంది. ఈ నిర్బంధంలోకూడ భూస్వాములను ప్రతిఘటించడం పెద్దఎత్తున, మిలిటెంట్‌గా సాగింది. ప్రజలు రెండున్నర లక్షల రూపాయల అప్పులు చెల్లించడానికి నిరాకరించారు. భూస్వాముల స్వాధీనంలోని రెండువేల ఎకరాల భూమిని, ఐదువేల

ఎకరాల బంజరు భూమిని జనం ఆక్రమించుకున్నారు. 1968 మార్చి 4న పెదఖర్జ గ్రామం దగ్గర పోలీసులు గిరిజన ప్రజానీకం మీద పెద్ద ఎత్తున దాడి చేసి కేదరి అనే జాతాపును, సింగన్న అనే సవరను చంపేశారు. ఇక ఇందుకు ప్రతిగా సాయుధ పోరాటం ప్రారంభించాల్సిందేననీ, అది రైతాంగ విముక్తి పోరాటంగా ఉండాలనీ సత్యం ఆగష్టులో దృఢంగా నిర్ణయించుకున్నాడు. 1968 నవంబర్ 25 ను ఆయన శ్రీకాకుళ రైతాంగ సాయుధ పోరాట దినంగా ప్రకటించాడు. 1969, 70 రెండు సంవత్సరాలపాటు 12,000 మంది సాయుధ పోలీసులు నిర్బంధకాండను కొనసాగించారు. 2000 మంది గిరిజనులు అరెస్టయ్యారు. 93 మంది ఉద్యమ కార్యకర్తలని, ప్రధాన నాయకత్వాన్ని ప్రభుత్వం హత్య చేసింది. 1971 నాటికి శ్రీకాకుళం పాలక వర్గాల దుర్మార్గానికి మరొక నిదర్శనంగా తాత్కాలిక అపజయానికి గురై ఒక స్మృతిగా నిలిచి పోయింది. తాత్కాలికంగా దెబ్బతిన్నా శ్రీకాకుళం ఒక ప్రజాఉద్యమపు క్రమ, సహజ పరిణామానికి నిదర్శనంగా నిలిచి పోయింది.

పుట్టుక, పరిణామం, అపజయాల వివాదాలనటుంచి, ఈ ఉద్యమం తెలుగునాట రాజకీయరంగంలో కొన్ని కొత్త సాంప్రదాయాల్ని బలంగా ప్రవేశపెట్టింది. "వెనకబడిన" ప్రాంతాలను నిర్లక్ష్యం చేసే ప్రభుత్వ విధానాన్ని ప్రజా పోరాటం వదిలేసిన ఉభయ కమ్యూనిస్టుపార్టీలు కూడ అనుసరించడంతో శ్రీకాకుళం లాంటి ప్రాంతాలకి ఆ పార్టీలలో ప్రాతినిధ్యమే లేకుండా పోయింది. ప్రజలు ఆర్థికంగా, సాంస్కృతికంగా ఎక్కువ అణచివేతకు గురి అయ్యే ప్రాంతాలకు శ్రీకాకుళ ఉద్యమం మరో సారి ప్రాధాన్యత నిచ్చింది. అలాగే సాధారణ కార్యకర్తలు నాయకులు కావడం తెలంగాణ విమోచనోద్యమంలోనే మొదలైనా శ్రీకాకుళ ఉద్యమంలో పైస్థాయికి చేరింది. అంతేకాదు, తన ప్రజాబలంతో సంఘీభావాన్ని జెనరేట్ చెయ్యడంలో కూడా శ్రీకాకుళం ఉద్యమం ఒక అడుగు ముందుకేసింది. భాస్కరరావు, మల్లికార్జునుడు, రాజారాం రెడ్డి, రమేష్‌చంద్రసాహు వంటి ఎందరో శ్రీకాకుళ ఉద్యమప్రేరణతో, ఉద్యమంలో పాల్గొనడానికి వెళ్ళారు. రాష్ట్రంలోనూ, దేశంలోనూ శ్రీకాకుళ ఉద్యమం మేధావుల సంఘీభావాన్ని సాధించింది.

అదే విధంగా శ్రీకాకుళ ఉద్యమం సాహిత్యరంగంలో కూడ తన వైన కొన్ని కొత్త సాంప్రదాయాల్ని ప్రవేశపెట్టింది. తెలుగుసాహిత్య, సాంస్కృతిక రంగాలను ఒక ఊపుఊపి ప్రత్యక్షంగా, పరోక్షంగా కొన్ని నూతన ధోరణులు తలెత్తడానికి కారణమైంది.

శ్రీకాకుళ విప్లవోద్యమం శ్రీకాకుళం అనే ఒక భౌగోళిక ప్రాంతానికి మాత్రమే చెందిందిగా ఎంతమాత్రమూలేదు. 1967 తర్వాత దేశవ్యాప్తంగా ఎక్కడెక్కడ నూతన మానవుడు ఆవిష్కరించబడ్డాడో, అక్కడక్కడ నక్సల్బరీ ఉన్నట్టుగా, శ్రీకాకుళం కూడ ఉన్నది. ఒక్క శ్రీకాకుళం వెయ్యి శ్రీకాకుళాలుగా వికసించింది, విస్తరించింది. శ్రీకాకుళం అనే భౌగోళిక ప్రాంతంలో ఉద్యమం తాత్కాలిక ఒడిదొడుకులకు గురిఅయి ఉండవచ్చు. కాని రాష్ట్రంలో మరొకచోట, మరొకచోట శ్రీకాకుళం పునర్జీవిస్తూనే ఉంది. అందువల్లనే శ్రీకాకుళ ఉద్యమ సాహిత్యం అంటే 1967 నుంచి ఇవాళ్టిదాకా వెలువడిన, వెలువడుతున్న సాహిత్యమే అవుతుంది. ఈ వ్యాసం పరిమితివల్ల 1967 నుంచి 1973 వరకు శ్రీకాకుళ ఉద్యమ ప్రత్యక్షప్రభావంతో శ్రీకాకుళ ప్రాంతం నుంచి వెలువడిన రచనలను ప్రధానంగా పరిగణించడం జరుగుతుంది. అలాగే, ఆ కాలంలోనే ఇతర ప్రాంతాలనుంచి శ్రీకాకుళ ఉద్యమ ప్రత్యక్ష ప్రభావంలో వచ్చిన బలమైన, ప్రధానమైన రచనలను కూడ ఈ పరిధిలోకి తీసుకురావడం జరుగుతుంది.

శ్రీకాకుళ ఉద్యమం కవిత్వం మీద చాల బలమైన ప్రభావంవేసింది. అది మౌఖిక కవితారూపమైన పాటలోనూ, మధ్యతరగతి కవితారూపమైన వచన కవితలోనూ కూడ ప్రతిఫలించింది. ప్రపంచంలోని అన్ని ప్రజాసంస్కృతుల లాగనే శ్రీకాకుళంలోని సవర, జాతాపు సంస్కృతులలో కూడ మౌఖిక సాంప్రదాయం ప్రబలంగా ఉంది. ఈ కారణంవల్ల గిరిజనసంఘాల నిర్మాణం పాటల ద్వారా ఆ అవసరాన్ని చెప్పడంతోనే ప్రారంభమైంది.

"కొండజాతి పేదరైతా
కొండమీద నీది బ్రతుకు

కండలన్నీ పిండి జేసుకొని
ఓ గిరిజన రైతా - పంటలన్నీ పండించెదవెంతో
పండినట్టి పంటలన్ని
పదియు రూకలకు నీవు
పాడు చేయుచుంటివేమోయి
ఓ గిరిజన రైతా - నీదు బ్రతుకు నీరు గారెనూ
వర్తకులు వడలు బలిసి
గుర్రుమనుచూ నిన్ను చూచి
కన్ను ఎర్ర చేయుచుండెదరో
ఓ గిరిజన రైతా - నిన్ను జూచి నవ్వుచుండెదరో
ఏమిభయము లేదు నీకు
ఎర్రజెండా నీడకు రావోయ్
బాధలన్ని బాసిపోవునురా
ఓ గిరిజనరైతా-నీదు కష్టములు తీరునురా" అనే పాట పాడి జనాన్ని సమీకరించే వాళ్ళమని వెంకటాపు సత్యం రాశాడు. అలాగే "నిదుర లేర ధీరుడ-కొండజాతి వీరుడ" అనే పాటతో మీటింగ్ ముగించే వారమని కూడ ఆయన రాశాడు. ఈ రెండు పాటలూ రాసిందెవరో ఆయన చెప్పలేదు. రెండో పాట శీర్షికే తప్ప మొత్తం పాటకూడ రాయలేదు. ఆ కాలంలో వచ్చిన కవితా సంకలనాలు వేట్లోనూ కూడ ఇవిలేవు. ఈ వివరాలు లేకపోయినా, సత్యం పుస్తకం ఆధారంగానైనా శ్రీకాకుళ ఉద్యమ సాహిత్యపు ప్రాథమిక సూచికలుగా వీటిని గుర్తించవచ్చు. ఇక ఆ తర్వాత ఉద్యమ కార్యకర్తల నుంచే పాటలు రావడం మొదలైంది. స్వయంగా సత్యం పాటలు రాయడం ప్రారంభించాడు. ఆయన రాసిన పాటల సంఖ్య చాల తక్కువ. చాల మామూలు మాటల్లో విప్లవోద్యమ అవసరాన్ని గిరిజనులకు వివరించాలని ఆయన పడిన తపన ఆయన పాటలన్నిటా కన్పిస్తుంది. "మావో సూక్తులు" అనే పాటలో

"ఇంటిని రోజూ తుడువకపోతే
దుమ్ము చేరునట నిజమేనోయ్
మనలో తప్పులు దిద్దుకొననిచో

మనము పాడగుట తప్పదురా" అనీ
"ఉత్పత్తిలో మన ప్రజాసైన్యము
తప్పక పాల్గొనునట్లు చేయవోయ్
లోటుగ ప్రజలతో సంబంధం
ప్రతి వారికీ కలిగుండాలటరా" అనీ
"విజయం పొందేటప్పుడు గర్వము
ఉండకూడదని చెప్పావోయ్
అపజయ మొందేటప్పుడు
రంగారసలు పనికి రాదన్నావోయ్" అనీ అయన మావో ఆలోచనా విధానంలోని ఎన్నో అంశాల్ని గిరిజనులకు సులభంగా వివరించే ప్రయత్నం చేశాడు. "కదలి రండి", "లేవరా! లేలేవరా-వీరుడా!", "తొలివిజయం", "కొండజాతి సింగములు" పాటలు శ్రీకాకుళ ఉద్యమంలోని వివిధ ఘట్టాల్ని చాల స్పష్టంగా వివరించి, శ్రోతల్ని పాఠకుల్ని ఉత్తేజితుల్ని చేస్తాయి. సత్యం పాటను ఒక అవసరంగా, ఆయుధంగా గుర్తించి సరిగా వాడుకున్నాడు. వెంపటాపు సత్యంకన్న ముందునుంచే కవిత్వంతో శ్రీకాకుళ విప్లవోద్యమాన్ని అందుకోవడానికి ప్రయత్నించినవాడు సుబ్బారావు పాణిగ్రాహి. ఆయన 1967 చివరికే శ్రీకాకుళం పోరాట గాథను "జముకుల కథ"గా రాశాడు. తెలుగు దేశంలో చాలచోట్ల ఆయన ఈ జముకులకథను ప్రదర్శించాడు. అక్టోబర్ 1968 వరకు రాసిన ఆయన గేయాలు "అగ్ని కణాలు" పేర ప్రచురితమయ్యాయి. స్వయంగా కళాకారుడు కావడం, వివిధకళారూపాలలో మంచిప్రవేశం, ఇంగ్లీషు, ఒరియా, హిందీ, బెంగాలీ భాషల పరిచయం ఆయనను గొప్ప సాంస్కృతిక సైనికుడిగా మలచాయి. ఈ ప్రభావాలవల్ల సాంప్రదాయిక ఛందస్సుకొంతా, కఠినపద ప్రయోగం కొంతా ఉన్నప్పటికీ, ఈ ప్రభావాల వల్లనే ఆయనకు అలవడిన దూరదృష్టి, ఆశావాదమూ, లోతైన అవగాహనా ఆయన కవిత్వం నిండా కనిపిస్తుంది. "అగ్నికణాలు" గేయ సంపుటిని ఆయన "కరకు కాంగ్రెస్ ప్రభుత్వ పోలీసుల తుపాకి గుండ్లకు గురియై నేలకొరిగిన శ్రీకాకుళం జిల్లా గిరిజన విప్లవ వీరుల"కు అంకితం చేశాడు. ఈ అంకితం "అశ్రుపూరిత నయనాలతో కాద"నీ, వాళ్ళ "ఆశయాలు సాధించి తీరుతామనే

ఆత్మవిశ్వాసంతో పిడికిలి బిగిస్తూ" నని ఆయన స్పష్టం చేశాడు. ఈ సంకలనం పాణిగ్రాహి కవిత్వానికి ఉన్న విస్తృత పరిధిని తెలుపుతుంది. "తెలుగు దేశము మనది తెలుగువారము మనము ముక్కోటి ఆంధ్రులము ఒక్కటై నిల వాలి"అన్న గీతంనుంచి "జై భారత జననీ నమో పతిత పావనీ" అన్న గీతం వరకూ గూడ ఈ సంకలనంలో ఉన్నాయి, మరోవైపు

"ఎగిరిందీ ఎర్రజెండా
కదిలిందీ ప్రతికొండా
గిరిజన సంఘాలెలిశాయీ
దుర్జనుల కెదురు నిలిచాయి" వంటి గీతాలూ,
"కలకత్తాలో వేయు
సరికొత్త నీ కేక
కంపనం పుట్టింది
కలవరం పెట్టింది
మా శత్రు వర్గాలు
బిత్తరై పోయాయి
మాతోటి వర్గాలు
జేజేలు కొట్టాయి" వంటి గీతాలూ ఇందులో ఉన్నాయి. పాణిగ్రాహి కవితలనూ పాటలనూ ఒక్కచోట సంకలితం చేసి విరసం 1972లో "ఎరుపు" సంకలనంగా ప్రచురించింది. పాణిగ్రాహి "ఎరుపు" పాట అందరికీ తెలిసిందే. ఆయన క్రమపరిణామంలో మార్పులకు గురైన పాట "తూర్పుజెండా" శ్రీకాకుళ ఉద్యమ అవగాహనలోని పరిణామాన్నికూడ తెలియజేస్తుంది. "ఎడమచేత పట్టవోయి ఎర్రని జెండా / తుపాకి పట్టవోయ్ వేరొకచేతా" అని ప్రస్తుతం ఆయన మార్పు చేసిన పదాలు మొదట ఆయన రాసినప్పుడు "ఎడమచేత పట్టవోయి ఎర్రని జెండా / పిడికిలి బిగించవోయి వేరొకచేతా" అని ఉండేవి. అట్లాగే "వస్తాము నేస్తం" అనే పాటలో "ఎందాక నేస్తం? / ఆగాగు వస్తాం / అందరం కలిశాం / ముందుకే పోదాం"అన్నచోట "ఆగాగు వస్తాం"ను "అందాక వస్తాం" అని ఆయన మార్పుచేశాడు. కమ్యూ

నిష్టులంగరూ పతాకగీతంగా పాడుకోదగిన "కష్టజీవులం మేము కమ్యూనిస్టులం/ జౌనన్నా కాదన్నా అదే ఇష్టులం" కమ్యూనిస్టుల సిద్ధాంతాన్ని, ఆచరణను సులభంగా వివరిస్తుంది. సిపిఐ (ఎం) రివిజనిజాన్ని ఎండగడుతూ

"కలకత్తా కాశీనాలుక
రుచి మరిగెను మధుర మిఠాయీ
సరికొత్తగ మాటలు జెపుతూ
చూపించెను మనకొక హోయి ॥కలకత్తా॥
కనిపెట్టిన కనిపించుసులే
తనలో ఒక వింతగు మార్పు
గతమంతా వెతికి చూచినా
లేదసలే ఇంతటి ఓర్పు ॥కలకత్తా॥
కన్నులలో ఎరుపుదనం
చూపులలో చురుకుదనం
మాటల్లో కరుకుదనం
లోపించిందెందులకో" అని అపహాస్యం చేశాడు.

"ఎన్ని చెప్పినా ఏమి చేసినా
అడిగిందెవరీ దేశంలో
అన్ని పాపములు పోవునులే
మీ రేసుకున్న ఆ వేషములో
ఇతరుల సౌఖ్యం దోచుకుతినడం
సూత్రం తెలిసిన వారండి
మతములు మాయలు మంత్రాలన్నీ
సమయం చూచీ వదలండి" అని "దేశభక్తులు" గేయంతో "దేశభక్తుల"ను అపహాస్యం చేశాడు.

"దిక్కు-మొక్కు-లేని జనం
ఒక్కొక్కరు అగ్నికణం
సింహకంఠ నాదంతో
వస్తారిక కాచుకోండి" అని "హెచ్చరిక" చేశాడు.

ఈ పాటలన్నీ ఒకఎత్తు, జముకులకథ ఒక్కటీ ఒకఎత్తు, కళా రూపాలను అతిశక్తివంతమైన ఆయుధంగా వాడుకోవచ్చుననే విషయం శ్రీకాకుళ ఉద్యమం స్పష్టంగా గుర్తించిందనడానికి పోరాట చరిత్రను జముకులకథ ద్వారా చెప్పాలను కోవడమే నిదర్శనం. గిరిజనుల జీవితచిత్రణతో, గిరిజన గ్రామాల లోకి షాహుకార్ల ప్రవేశంతో ప్రారంభమైన ఈ జముకులకథ లేవిడి సంఘటన తర్వాత సంఘ నిర్మాణంతో, ఆక్రమంలో సత్యంకోసం పోలీసుల నిఘాతో ముగుస్తుంది. విడిగా పాటలుగా ప్రచారమైన వాటితో సహా ఈ జముకులకథలో కొన్నిడజన్ల బాణీల పాటలున్నాయి.

శ్రీకాకుళ ఉద్యమం నిరక్షరాస్యులయిన కవులను వెలుగులోకి తెచ్చింది. నిర్బంధం ఫలితంగా వందలాది మంది గిరిజన ప్రజానీకం అరెస్టయి విశాఖ పట్నం జైల్లో మగ్గి పోయారు, ఆజైల్లో వెలువడిన కవిత్వంతో, మరికొన్ని సత్యం, పాణిగ్రాహి కవితలు కలిపి "శంఖారావం" సంకలనం ప్రచురితమైంది. ఈ సంకలనంలోని "విప్లవజ్యోతి" అనే సత్యం సంస్మరణగీతం, "అరుణ తార" అనే నిర్మల సంస్మరణ గీతం గిరిజనులు కట్టారని శివసాగర్ రాశారు.

ఓ వెంపటాపు సత్యం
నిను మరువలేము నిత్యం
వీడబోము నీ లక్ష్యం
సాధిస్తాం ఇదిసత్యం ॥ఓ॥

నీ వార్తవిన్న ఈ వీరజనం
ఆపలేరిక వేడిజలం
చిందించిన నీ రక్తంలో
ఉదయింతురులే వీరులెందరో ॥ ఓ ॥

కన్నకొడుకులా చూసే కొండలూ
తమ ప్రాణంగా దాచే బండలూ
కార్చిన కన్నీరే....
విప్లవ ప్రవాహమై ప్రవహించెను ॥ఓ॥

నిర్మించిన నీ కంచుకోటను
కదలించేవాడెవడూలేడు
వెలిగించిన నీ విప్లవజ్యోతి
ఆర్పివేయు వాడెవ్వడు ॥ఓ॥" అని

ఆ అనామక విప్లవకవి సత్యంకు జోహార్లు తెలిపాడు. నిర్మలకు జోహార్లు చెప్పిన గీతంలో గిరిజన విప్లవకవి నిర్మల పోరాటాన్ని తన మాటలలో, ఉత్తేజ కరంగాచెప్పాడు. "శంఖారావం"లో ఎక్కువ గీతాలు అమరవీరుల సంస్మరణ గీతాలే. పంచాది కృష్ణమూర్తి, సుబ్బారావు పాణిగ్రాహి, వెంపటాపు సత్య నారాయణ, ఆదిభట్ల కైలాసం, నిర్మల, చాగంటి భాస్కరరావు, ఎం. వి. రమణమూర్తి, బిక్కి రాములు, చిన్నం నాయుడు, అప్పారావులను సంస్మ రిస్తూ రాసిన పాటలు ఈ సంకలనంలో ఉన్నాయి. "శ్రీకాకుళంలోన చిందింది రక్తమ్ము", "ఈ విప్లవాగ్నులు ఎచటివని అడిగితే" అనే ప్రసిద్ధమైన పాటలు కూడ ఈ సంకలనంలో ఉన్నాయి.

పాట, హరికథ, బుర్రకథ, జముకులకథ వంటి అన్ని మౌఖిక కళా రూపాలను వాడుకోవడంతోపాటు శ్రీకాకుళ ఉద్యమం తనలోంచే కవుల్ని సృష్టించింది. ఈ ఉద్యమ విజయానికి "శంఖారావం" సంకలనం ఒక ప్రతీక.

మరోకవైపు 1969 నాటికే శ్రీకాకుళ ఉద్యమం వచన కవితలో ప్రతి ధ్వనించడం మొదలైంది. "తిరుగబడు" కవులలో, "మార్చ్" కవులలో ప్రతి ధ్వనించింది శ్రీకాకుళ ఉద్యమమే. వచన కవిత ద్వారా మైదానప్రాంత మధ్య తరగతికి శ్రీకాకుళం ఉత్తేజాన్నిచ్చింది. జులై 1970 లో ప్రచురితమైన "మార్చ్" కవితా సంకలనంలో శ్రీకాకుళ ప్రస్తావన ఉంది.

"నిన్న నక్సల్‌బరీలో వీచినగాలి
నేడు శ్రీకాకుళంలో వీస్తున్న గాలి
రేపు దేశమంతటా వీచనున్న గాలి" అని "మార్చ్" ప్రకటించింది. శ్రీకాకుళ గాలి సాహిత్యరంగమంతా వీచి, ఆ ఉద్యమ ప్రేరణతో, సుబ్బారావు పాణిగ్రాహి సంధించిన కళలతోవన విప్లవ రచయితల సంఘం ఆవిర్భవించింది. దాని మొదటి ప్రచురణ "ఝంఝ" కవితా సంకలనంలో "నరుడో! భాస్క

రుడా"! పాట అచ్చయింది. "నరుడో భాస్కరుడా" ఒక నూతన ధోరణికి, ఒక నూతన అవసరానికి ప్రారంభంగా అప్పటికే తోచింది. అంటే విరసం తన వేళ్ళను వెతుక్కుంటూ సాగి మళ్ళీ పాటలో తనను తాను ఆవిష్కరించుకుంది, సాహిత్యరంగంలో శ్రీకాకుళఉద్యమం సాధించిన పరిణామం విస్తరణ, డి-క్లాస్ కావడం రెండూ కలగలసి సాగిందన్నమాట. నరుడో భాస్కరుడా నుంచి గోండు పాటల దాకా విప్లవసాహిత్యోద్యమం మొత్తంగా మౌఖికసాంప్రదాయ అవసరాన్ని గుర్తించేట్టుచేసింది శ్రీకాకుళ ఉద్యమం. విప్లవ సాహిత్యోద్యమానికి ఇలా "నరుడో!భాస్కరుడా!"తో మార్గ నిర్దేశం చేసిన శివసాగర్ కవిత్వంపై శ్రీకాకుళ ఉద్యమం ప్రభావం మిగిలిన కవులమీదికంటె ఎక్కువ. ఆయన కవితల్లో రెండుమూడు మినహాయించి మిగిలినవన్నీ శ్రీకాకుళ ఉద్యమ ప్రత్యక్ష ప్రభావంతో వచ్చినవే. వెంపటాపు సత్యాన్ని సత్యంగా అభివర్ణించి "సత్యం చావదు (డు)" అని శివసాగర్ అన్నాడు.

"....సత్యాన్ని చంపలేరు
అది చిరంజీవి
సత్యాన్ని ఓడించలేరు
అది అజేయం
ఇప్పపూవులో నిప్పురవ్వల్ని
సృష్టించిన సత్యం
కొండవళ్ళకు తిరుగుబాటు పాఠాలను
నేర్పిన సత్యం
నాగేటి చాలులో
నక్షత్రాలను కనుగొన్న సత్యం
అడవిలో రణశంఖం ఊది
మైదానాలను మేల్కొల్పిన సత్యం
అడవి దున్న కంటిలోకి
జనబాణాన్ని సూటిగా కొట్టిన సత్యం
అడవితేనె అందరికీ
అందించిన సత్యం చావదు

అది జనం! అది ప్రభంజనం!

అది ఖడ్గసంగీతం। అది యుగ సంకేతం" అని ఆయన ప్రకటించాడు. మేరిమికొండల్లో, ఉద్దమాల కొండల్లో, కురుపాంకొండల్లో, సంగమెలస కొండల్లో సాగిన పోరాటాన్ని వివరించి, అక్కడ సాగిన దుర్మార్గ నిర్బంధం వల్ల కలిగిన భయభీతావహాన్నీ, నిరుత్సాహాన్నీ జయించేందుకు, "గుండెలోని ఆశ ఎర్రజెండాగా" ఎగిరేసేందుకు, కళ్ళలోని కాంతిబాట వెలిగించేందుకు, చీకటిలో మిణుగురులు చూడటం తెలిపేందుకు ఆయన "ఏటికి ఎదురీదు వాళ్ళమురా" అని ప్రజలకు ధైర్యం చెప్పాడు. పాణిగ్రాహి శివసాగర్‌ల ఇద్దరి కవితలూ శ్రీకాకుళ ఉద్యమానికి అప్పటికప్పుడు కలిగిన సంచలనాలు. ఇవాళ వాళ్ళ రచనలలోని అవగాహన మనకు ఎలాకనబడినా ఆ రచనలు ఆ నాటి పోరాటానికి సరైన, ప్రతిబింబాలైన చిత్రీకరణలని గుర్తించాలి.

"అదిగదిగో బెంగాల్లో
గర్జిస్తూ గాండ్రిస్తూ
వైరివంక చూశాడు
శ్రీకాకుళం జిల్లాలో
ఆకలి గొను గిరిజనుడు
అర్జునులా విల్లుసాచి
బరి తెగించి దుమికాడు
నైజాంలో రజాకార్ల
కాంగిరేసు పోలీసుల
నల్లగుండె కదిలించిన
నల్లగొండ జబ్బశక్తి
మళ్ళీరుచి దొరుకునులే
తెలంగాణ వీరజాతి
తెగువ మరల జూపునులే
దామర మడుగున హరిజన
వాడలన్ని బుసగొట్టును
రుసరుసలాడిన దదిగో

అస్సాంలో కొండజాతి
త్రిపురాసురులందరినీ
యమపురి కంపగనేదే
త్రిపురలోని ఆదిశక్తి
ప్రళయ నాట్యమాడసాగె" అని పాణిగ్రాహి రాశాడు.
"బుగులుకొనే జనం గుండె ఏమిటన్నది ?
కీచకవధ తప్ప మరోమార్గం లేదన్నది" అన్నప్పుడు గానీ,
"బుగతగాడి నెత్తురుతో - తళతళలాడే కత్తులు"
"రూపాయి కొండలోన - కోసిన సిపాయి పీక"
"ఆవిరి కొండలలోన - పారిన వీరుల రక్తం" అన్నప్పుడు గానీ శివసాగర్‌లో కనిపించింది ఉద్యమానికి యధాతథ చిత్రీకరణే. ఇవాళ పాణిగ్రాహి ప్రజా పంథాలో కవిత్వం రాయలేదని విమర్శిస్తున్నవాళ్ళు ఆ నాటి ప్రజా ఉద్యమం నడిచిన పంథానే పాణిగ్రాహి ప్రతిబింబించాడని గుర్తించడం మంచిది. జులై 1971 నాటికే శ్రీకాకుళ అపజయంతో అదిరి, విప్లవ విద్రోహ వీలునామాపై నిర్లజ్జగా సంతకం చేసిన వాడ్ని హెచ్చరిస్తూ శివసాగర్ వినిపించిన బహిరంగలేఖ "ఉద్యమం నెలబాలుడు" శ్రీకాకుళ ఉద్యమ స్ఫూర్తిని, పటిమను మనకళ్ళకు కడుతుంది.

కథా ప్రక్రియలో శ్రీకాకుళోద్యమం ఎక్కువగా ప్రతిఫలించలేదనే చెప్పాలి. ఇందుకు ఒక కారణం ఆ కాలంలోనే పెద్దఎత్తున వ్యాపార పత్రికలు పుట్టుకు రావడం, రచన వ్యాపారంగా మారిపోవడం కావచ్చును. మరొక కారణం శ్రీకాకుళ ఉద్యమం ప్రధానంగా గిరిజనోద్యమం కావడంతో గిరిజన జీవితంతో ప్రగాఢ పరిచయం ఉన్న రచయితలకు మాత్రమే కథలో దాన్ని చిత్రించే అవకాశం ఉండింది. ఇతర రచయితలకు ఉద్యమంపట్ల సానుభూతిఉండినా, వాళ్ళకు ఇతర మధ్య తరగతి మనుషులలాగానే శ్రీకాకుళ ఉద్యమమంటే ఒక రొమాంటిక్ భావనే గాని రక్తమాంసాలుగల మనుషులు తమ మనుగడకోసం సాగిస్తున్న జీవన్మరణ పోరాటం, ఒక భౌతిక వాస్తవికతకాదు. ఈ కారణాల వల్ల శ్రీకాకుళ ఉద్యమం చాల అవసరమైన, ప్రయోజనాత్మకమైన, ప్రతిభావంతమైన కథా ప్రక్రియలో ఎక్కువగా వివరణ పొందలేక పోయింది.

శ్రీకాకుళ ఉద్యమం గురించి వచ్చిన కథలు పదికన్న మించలేదు. కాళీపట్నం రామారావు ఒకటి రెండు కథలకు శ్రీకాకుళ ఉద్యమం నేపథ్యంగా ఉంది. భూషణం కథలు, శ్రీపతికథలు రెండుమూడు, చెరబండరాజు కథ ఒకటి ప్రధానంగా శ్రీకాకుళఉద్యమ కథలుగా చెప్పుకోదగినవి. వీటిలో శ్రీకాకుళ జీవితచిత్రణ లోతుగా, వాస్తవానికి దగ్గరగా ఉన్నది భూషణం కథలలోనే. చెరబండరాజుకథ "చిరంజీవి" ప్రత్యక్షంగా శ్రీకాకుళ ఉద్యమానికి సంబంధించింది కాదు. శ్రీకాకుళ ఉద్యమకార్యకర్త ఐన ఒక పద్నాలుగేళ్ళపిల్లవాడ్ని డి. ఎస్. పి. కాల్చి చంపేసినప్పుడు, ఒక మామూలు కానిస్టేబుల్‌లో కలిగే మానసిక సంఘర్షణ ఆ కథా భూమిక. శ్రీపతి కథల్లో ఒక్క "నర్తోడు" మాత్రమే లభ్యమైంది. ఒక చేయని నేరం ఆపాదించబడి తన్నులు తిన్న ఒక అమాయక గిరిజనుడు తిరగబడితే ఎలా తిరగబడతాడో ఆ కథ చెప్పింది. పీడకులు ఎంత కాగితపు పులులో ఆ కథ వివరించింది.

భూషణంకథ "ఉద్ధరింపు" కార్పొరేషన్‌ల ద్వారా, హెల్త్ సెంటర్లద్వారా గిరిజనులను ప్రభుత్వం "ఉద్ధరించిన" వైనాన్ని వివరిస్తుంది. "అడివంటుకుంది"కథ గిరిజనులమీద షాహుకార్ల దోపిడీ ప్రారంభమైన దగ్గర్నుంచి గిరిజనుల తిరుగుబాటు దాకా సాగిన చరిత్రసంతా ఒక గ్రామం కథగా రేఖామాత్రంగా వివరిస్తుంది. వర్గ సమాజంలో పీడిత వర్గాల శ్రమకూ, సిజాయితీకీ, కష్ట సహిష్ణుతకూ ఉండే నిష్ఫలత్వాన్నీ, పీడకవర్గాల అన్యాయమైన తీర్పులనూ చెప్పి "తీర్పు"కథ పీడిత వర్గాల న్యాయమైన తీర్పును ప్రకటిస్తుంది. "ఇదే దారి" కథ షాహుకార్ల దోపిడీని చెప్పి ఆ దోపిడీ పోగొట్టే దారిని చూపుతుంది. "ఇదిగిదిగో, ఇదిగిదే మనలాటి బతుకు పోయినోల్లంతా సెయ్యాల. మన బతుకులు తీస్పినోల బతుకులు, మన కట్టాన్నీ, సె(పటనీ, రగతాన్నీ మింగిసినోల బతుకులు బంగారంనాగ పచ్చగా ఉన్నివ్వగూడదు. ఇదిగినాగే సెయ్యాల మరినాగే ఊరూరా, వాడవాడా, ఉన్న మనలాటోల్లు నెగిస్తే ఈల గుణ్ళు, మేడలూ కూలిపోయి కాలిపోతాయి, రాండి. ఈడుదోసి దాస్పిన దాన్నిం గాదెలు బద్దలు గొట్టుక తినండి. ఈ డాస్తంతా సరిసమానంగా పంచేసుకొండి. ఈడిక మట్టి నాబాం(వి కాజెయ్యనేడుగదా. మన బూ(వులు మనవంతా దున్నక తిందుంగాని, ఇదిగినాగ తిండానికి, ఇలాంటిపింటి అప్పులరాజ్యం ఆరిపోనానికి, ఈ పింటి పాయిదాల రాజ్యం పాతీడానికి మన(వంతా పలుగుపారా కొడవలీ

గొడ్డలీ ఏద్దొరికితే అది పట్టుకోని నడిసెలదాం. నడిసి ఈ పింటి జాతిని దుంప నాశనం సేసిద్దుం. అదిగదే, అదిగదే మనలాటోల్ల దారి. అదిగదేదారి. అదే దారి" అంటాడు పువ్వుల రాజన్న.

శ్రీకాకుళ ఉద్యమం ఒక నవలను కూడ సృష్టించింది. భూషణం రాసిన "కొండగాలి" అనే ఈ నవల శ్రీకాకుళ ఉద్యమంలోని ఒక ప్రధాన దశకు అద్భుతమైన చిత్రీకరణ. సంఘనిర్మాణం నుంచి గెరిల్లా చర్యల వరకు సాగిన శ్రీకాకుళ ఉద్యమ కాలాన్ని ఈ నవల నాయుడు వలస, గదబవలస అనే రెండు గ్రామాల వాతావరణంలో చిత్రిస్తుంది. ఆదెమ్మ, గడ్డిసెట్టి, సోమయ్య, గురువు ప్రధాన పాత్రలుగా ఈ నవల సాగుతుంది. గిరిజన జీవితం గురించి, షాహుకార్లకూ, పోలీసులకూ, ఫారెస్టు అధికారులకూ ఉన్న సంబంధాల గురించీ పోరాటం పైదశకు ఎదగ వలసి వచ్చిన అనివార్యత గురించీ "కొండగాలి" మనసుకు హత్తుకునేట్టు వివరిస్తుంది. ఉద్యమంలో వివిధ దశలు ఎంతసహజంగా ఎదిగాయో ఆ దశల పరిణామం నవలలో అంత సహజంగా చిత్రించడం జరిగింది. శ్రీశ్రీ అన్నట్టు ఈ నవల ఒక "సజీవచిత్రం."

"ఆదెమ్మ లేచింది. సోమయ్య లేచాడు. పసికందుని వీపుకు కట్టుకొని ముత్తేలు లేచింది. కొండలూ కోనలూ గట్టులూ పుట్టలూ చెట్టులూ చేమలూ వాగులూ వంకలూ నడిచాయి. కొండలు కదిలాయి, కొండగాలి దేశం నలు మూలలా పెనుప్రళయంగా వీచింది" అని ఈ నవల ముగుస్తుంది. శ్రీకాకుళ ఉద్యమం దెబ్బతిన్న తర్వాత మూడు సంవత్సరాలకు కూడ రచయితలో, పాఠకునిలో ఈ ఆశావహ దృష్టి కలిగించడమే-ఇవ్వాళ్టి పెను ప్రళయాన్ని దృష్టిలో ఉంచుకొని ఆలోచిస్తే-శ్రీకాకుళ ఉద్యమం సాహిత్యరంగంలో ఇనుమడింప జేసిన దూరదృష్టికి నిదర్శనం. ఈ దూరదృష్టికి, ఈ విప్లవ ఆశావహ దృష్టికి మూలం శ్రీకాకుళ ఉద్యమం.

శ్రీకాకుళం జిల్లా కొండ ప్రాంతాలలో ఈ వ్యవస్థకు వ్యతిరేకంగా గిరిజనులు చేసిన భౌతిక సంఘర్షణే శ్రీకాకుళం ఉద్యమం. ఈ భౌతిక పునాది నుండి పుట్టిన "శ్రీకాకుళం" ఇప్పుడిక ఎంత మాత్రమూ కేవలం ఒక భౌగోళిక ప్రాంతంకాదు. అది నూతన సమాజంకోసం అణచబడ్డ ప్రజానీకం చేస్తున్న పోరాటాలకి ఉత్తేజాన్నిచ్చే ఒక ప్రతీక. ఈ భావం, ఈ ప్రతీక ఇవ్వాళ్టి కరీంనగర్, ఆదిలాబాద్, వరంగల్ లో భౌతిక రూపాన్ని సంతరించుకుం టోంది. శ్రీకాకుళ ఉద్యమ సాహిత్య పరిణామక్రమంకూడాఅదే.

# వెలలేని రత్నాలు

శ్రీకాకుళంలోన చిందింది రక్తమ్ము
కాల్వలై కలిసింది కొండవాగులలోన
బండ లెరుపెక్కినాయీ....
పోరాడ కొండలే కదిలినాయీ ॥శ్రీకాకుళం॥

తొలి అమరవీరులౌ కోరన్న మంగన్న
వారి ఆశలు నిలుప రెంజిమూ భీమన్న
రణ రంగమున ప్రమందిరీ.... పోరాట
జ్వాల మింటికి లేపిరీ.... ॥శ్రీకాకుళం॥

ఆంధ్రరైతుల పోరు ఆకసమ్మున కెగయ
కొండంత అండయౌ కామ్రేడు పంచాది
వేడి నెత్తురు చిలికెరా.... కడసారి
మావోకు జే పలికెరా ॥శ్రీకాకుళం॥

వైప్లవం గీతాల వెలుగు చూపించాడు
కవులలో సింహమై గర్జించి పలికాడు
పాణిగ్రాహిని చూడరా.... ఆ అమర
వీర పాటలు పాడరా.... ॥శ్రీకాకుళం॥

ప్రజల కొరకై ఆడి ప్రజలకొరకై పాడి
ప్రజలకై పోరాడి ప్రాణాలు విడిచాడు
వీరకిశోరమ్మురా.... చినబాబు
ఆ మార్గమునె నడువరా.... ॥శ్రీకాకుళం॥

వీరనారీమణులు నిర్మలా అంకమ్మ
శత్రువుల గుండెలను చీల్చి చెండాడారు
ధృవతారలై నారురా.... ఇల
కాంతిరేఖలై వెలిశారురా ॥శ్రీకాకుళం॥

మావో మహాశయుని మార్గానపయనించి
తామాడ గణపతులు త్యాగులై నిలిచారు
వెలలేని రత్నాలురా.... మన భరత
పుత్రులలో ఉత్తములురా ॥శ్రీకాకుళం॥

# గెరిల్లా

**పి. చంద్**

మే మాసం ఎండ....నిప్పులు చెరుగుతాఉంది.... కనుచూపు మేరలో నీడన్నదెలేదు.... సముద్రము తలాపున పెట్టుకొని చాపనీళ్ళ కేడ్చిందంటే ఇదేనేమో ? అడివిలో నీడకోసము వెతుకులాట.... అది గొంతులెండిపోయి.... ఒక్క-చుక్క నీటికోసము నోరు వెంపర్లాడుతున్నవేళ.... ఒక్క-క్షణం ఆకులు రాల్చిన చెట్టుకిందనైన నిల్చుంటె ఎంతహాయిగా ఉండేది.... వీపుమీది "కిట్టి బ్యాగ్" మరింత కృంగదీస్తున్నది....భుజం మీది తుపాకి తాప తాపకు భుజాలు మార్చుకుంటేగాని కదలలేక పోతున్నారు. దానికి తోడు రెండు రోజుల నుండి తిండిలేదు.

ముందు నడుస్తున్న దళ నాయకుడు తన దళ సభ్యులకేసి చూసిండు.... అందరి మొఖాలు వాడిపోయినయి.... ముఖ్యంగా అందరికంటే చిన్నవాడైన రవి ఎర్రటి మొఖం పూర్తిగా నల్లబారింది....పెదవుల మీద వేడి పొక్కులా వచ్చినయి....అతన్ని చూస్తుంటే జాలికల్గింది.... అయితే అది ఎంతో సేపు నిలువలేదు....ముందుకు చూస్తు "కామ్రేడ్స్ గమ్యం దగ్గరికొచ్చింది అదిగో దూరంగా అగుపిస్తున్న బోడును సమీపించేంత వరకే" అంటు వాళ్ళను ఉత్సాహ పరిచిండు....అందరు ఒక్కసారి తమదళ నాయకుని వైపు చూసిండ్లు....నల్లటి మొఖం మరింత నల్లబడి చమట కక్కుతుంది....ముడుచుక పోయిన కనుగుడ్లలోకి చూసారు.... అవి సూటిగా స్థిరంగా ఉన్నాయి....

బాగా పరిచయమున్న దారంట వాళ్ళు నరాసరి కదిలిపోయిండ్లు.

---

అమర వీరుల త్యాగ మన్యథా పోదురా
పోరాట జ్వాలలూ పెల్లుబికి నాయిరా
ఆయుధము ధరియించరా....సోదరా
శత్రువుల వధియించరా
జనతంత్ర రాజ్యాన్ని స్థాపించరా ॥శ్రీకాకుళం॥

(శంఖారావం, విప్లవగేయాల సంకలనం నుంచి)

వాళ్ళను వెన్నంటి వస్తున్న "ఆంటీ నక్సలైట్ స్క్వాడ్" గూడెందాటి కాలిబాటంట అడివిలోకి వచ్చారు.... అకాలిబాటైనా పోనుపోను అదృశ్యమైంది.. చిన్నచిన్న గులకరాల్లు.... ఎటుపోవాలో తెలియక ఎస్. ఐ. కేసి చూసిండ్లు.... వెంటవున్న పోలీసులు.... ఎస్. ఐ. చిరుబుర్రులాడుతున్నాడు.... ఆకాశంల సూర్యునైన చూడవచ్చేమోగానీ యస్.ఐ. మొఖంలోకి చూడటానికి పోలీసులు జంకిండ్లు.

"లంజ కొడుకులు పారిపోయిండ్లు" కోపమంతా వెళ్లగక్కిండు యస్.ఐ.... అతను మాట్లాడె ప్రతి నాలుగు మాటల్లో ఒక్కటి బూతు మాట వుతుంది.... అది అతనికి బాగా అలవాటయింది. అప్పుడప్పుడు తన క్రింద పని చేస్తున్న కానిస్టేబుల్స్‌కు కూడా అలవాటయింది.... కాకుంటే పై అధికారులు వచ్చినప్పుడు అతి విచిత్రంగా.... ఎంతో వినయం ఉట్టిపడేలా మారిపోతుంది అతని గొంతు....

యస్. ఐ. అడివి దున్నపోతులా ఉన్నాడు.... ఎండకు తడిసిన కాకీ బట్టలు శరీరానికి హత్తుక పోతున్నాయి. "చేతికిదొరికినట్టే దొరికిన షికార్ మళ్ళ అంతలోనే మాయ మయింది" మనసులోనే గునుసుకున్నడు.... నామపెట్టిన నక్కలా చూసిండు....ముందుకు పోదామంటే కాళ్ళల్లో వనుకుపట్టింది. మాదర్‌చోత్‌గాల్లు ఎంతకైనా తెగించినోల్లు...." ఇంత దూరము చొచ్చుక రావటమే ప్రమాదం" అన్న ఆలోచన వచ్చే సరికి....ఎన్నుపొంటి వణుకు పుట్టింది.... ఎండిపోయిన టేకు ఆకుల మధ్య ఏదో సరసర కదిలిపోయినట్టు అలికిడి....

భయంతో బిక్క చచ్చిపోయిన పోలీసులు బొక్క బోర్లాపడి తుపాకులు సరిచేసుకున్నారు....అప్పటికే చిన్న ఒర్రెలోకి జారుకున్న యస్.ఐ. చప్పుడైన దిక్కుకు గుడ్డిగా ఓ రౌండు పేల్చిండు.... కళ్ళు తెరిచి చూసేసరికి చుట్టు ఏమి కన్పించలేదు మట్టి తప్ప....ఇంకాస్త తల పైకెత్తాలంటే భయం....ఉండి ఉండి తల కొద్దిగా పైకెత్తిండు ఒర్రెలోనుండి....అప్పడికే తమ యస్.ఐ. కోసము వెతుకుతున్న నాలుగు జతల పోలీసు కళ్ళు చూసి ఉక్రోషం కల్గి "క్యా దేక్‌రెహై....కిదర్‌గయా మాకెలపుడా" అరిచిండు....

"కోయి నహీ సాబ్.... చెవుల పిల్లి....ఇటు ఉరికింది" మూతి మీద మీసం లేని గడ్డపు తుర్కాయన అన్నడు....

"జానెదో కిదర్ జాతా....ఆ లంజ కొడుకులను ఒక్కొక్కన్ని కాల్చి వేస్తా...." అనన్నడు....

అలా అన్నప్పుడు ఒక్క క్షణం అతని మనసులో సర్కిల్ లింగారెడ్డి మెదిలిండు....ఇంట్ల ఉనోళ్లను కాల్చి చంపినందుకె రాష్ట్రపతి పతకం దొరికింది.... అటువంటప్పుడు అడివిలో వేటాడినందుకు....తప్పకుండా.... నిన్నగాక మొన్న చెన్నూర్ల హెడ్డు కానిస్టేబుల్ గానికి పదివేలు ఇచ్చింది ప్రభుత్వం.... ఆలోచిస్తుంటే నక్సలైట్లను చంపటమే ప్రమోషన్‌కు దగ్గరి దారిలా కనిపిస్తుంది.... అటువంటి అవకాశము వచ్చినట్టే వచ్చి చెయ్యి జారిపోతుందన్న కోపంలో....

"లంజ కొడుకులారా ఇంకేమి చూస్తారు వెనక్కి పద" అంటు కానిస్టేబుల్స్ మీద కసురుకున్నాడు....

ఆ ఎండలో తప్పడ తప్పడ బూట్లు ఆడించుకుంటు తుపాకులు సవరించుకుంటు గూడెంలకు వచ్చింద్రు పోలీసులు. దాహంతో గొంతెండిపోతుంది అందరికి.... మంచినీల్ల కోసము కేకవేస్తే.... ఒక్కరు గుడిసెల నుండి బయటికి రాలేదు.... అసలు గూడెంలో ఎవరు ఉన్నజాడే కనిపించటము లేదు.

యస్.ఐ. వచ్చి జీపులో కూసున్నాడు....వాటర్ బ్యాగెత్తి గటగట సగమన్ని నీల్లు తాగిండు....మిగిలింది కానిస్టేబుల్స్ గొంతులు తడుపుకున్నారు....

"గూడెంల ఉన్న లంజ కొడుకులను తీస్కరాండ్లి" ఆర్డరేసిండు. యస్.ఐ.

లెక్కకు పదంటే పదే ఉన్న గుడిసెలను చుట్టి రావటానికి పోలీసులకు పది నిముషాలు కూడా పట్టలేదు....

కంటికి సజావైన ఒక్క యువకుడు కన్పించలేదు....పిక్కబలమునోడు ఎవ్వడు గూడెంలలేడు.... ముడుతలు పడి చావుకు సిద్ధమైన ఓ ముసలోడు.... పుస్సు పుస్సుకుంటు వచ్చిండు....వాని పక్క మరో గుడ్డి ముసలోన్ని.... తీవ్రంగా జ్వరంతో బాధపడుతున్న ఓయువకున్ని పోలీసులు తీస్కవచ్చిండ్లు.... వాళ్ళను చూసిన యస్.ఐ. "ఆదొల్లను కూడా గుంజుకరాండ్లి" అని అరిచాడు.

బోరు బోరున ఏడుస్తుంటే గూడెంలోని ఆడవారినందరిని ఒక చోట కుప్పేసిండ్లు....నడుముల చుట్టుచుట్టుకున్న గుడ్డపేలికలు తప్ప రొమ్ములమీదేమీ ఆచ్ఛాదనలేదు....యస్.ఐ. అసహ్యంగా మట్టికొట్టుక పోయిన శరీరాల కేసి చూసిండు....చాల రోజుల నుంచి అడుపులు పట్టి తిరుగుతున్న పోలీసోల్లు నజర్ గల్ల అమ్మాయిలకేసి పట్టిపట్టి చూస్తున్నరు.

"లంజెల్లారా! మీ మొగోల్లంతా ఎటు పోయిండ్లే" యస్.ఐ.

ఎవరు సప్పుడు చెయ్యలేదు....

ఓ ముసల్ది ధైర్యంచేసి "బంకకు అడవిలకు పోయిండ్లు గీయాలప్పుడు ఎవరుంటరు బాంచెను"

"అడవిలకు పోయిండ్లానే లంజ.... పొరకలసార్లతో కల్సిపోలేదే" పోలీసోడొకడు కర్రతో ఒక పోటు పొడిచిండు.

ముసల్ది ఎందుకో కిక్కురుమనలేదు....మరి ఓపికలేకనో, అసహ్యంతోనో, మరి అలవాటుగానో....

"పార్టీ వాళ్ళు వస్తె.... ఎవరు తిండి పెట్టవద్దు తిండి పెడ్తె మక్కెర్గలి తన్ని జైల్ల పెడ్తం....గూడెం గూడెంసు తగలబెడ్తం....వాళ్ళు వస్తే మాకు తెలపాలి" ఆడోల్లసుట్టు తిరుక్కుంటూ మధ్య మధ్య కర్రతో రొమ్ముల మీద పొడుస్తూ తిరిగిండు యస్.ఐ..

అప్పటి దాక నిలబడలేక కూలబడ్డ యువకుని దగ్గరి కొచ్చిండు.... "నిల్చోరా లంజకొడుకా....నఖరాలు చేస్తానావురా"

"అయ్యా బాంచెను జ్వరమొచ్చి చాతనయితలేదు" అంటు లేవటానికి ప్రయత్నించి కూలబడిపోయిండు....

"లేరా....మంచిమాటకులే" యస్.ఐ.

అయినా లేవలేదా యువకుడు.

ఎండలో తిర్గిన కోపమో, మరేమో కాని.... యస్.ఐ. కర్రతో అదే పనిగా కొట్టడము మొదలు పెట్టిండు....

అది చూస్తు ఆడోల్ల బోరున ఏడ్చిండ్లు.... ఆ అలజడికి చెట్ల మీద పక్షులు భయంతో పారిపోయినయి..

ఆ యువకుడు మాట పలుకు లేకుండా స్పృహ కోల్పోయిండు., యస్.ఐ సూచన మేరకు ఆ తర్వాత పోలీసులు ఆ యువకున్ని జీబులో వేసుకొని కదిలిండ్లు.

జీబు గూడెం దాటి లొద్దిలో ఉన్న వాగు దగ్గరికి వచ్చేసరికి....అడివంత దద్దరిల్లేలా ఒక్కటే మోత తుడుం మోత....

జీబు తొందరగా పోనిచ్చే తొందరలో వచ్చి సుర సుర కాలుతున్న నడి వాగులో ఆగింది....ఫోర్ వీలర్ప్ కూడా పనిచేయకుంటయింది.. అందరు దిగి జీబు నెట్టే ప్రయత్నంలో ఉన్నారు....

అంతకంతకు తుడుం మోత.... గుండెల్లో మోగుతుంది.. భయం ఆవరించింది.. అయాసంగా రొప్పుతున్న పోలీసులకు వాగుకు రెండు వైపులా జనం.... కర్రలుగుతుపలు పట్టుకొని....ఎక్కడి నుంచివచ్చిండ్లో ఏమోగాని.... ఎక్కడ చూసినా పట్టుమంటే పది మంది కన్పించని అడివిలో అంత మంది క్షణాల మీద ఎలా పోగయ్యారో అర్థం కాలేదు యస్.ఐ.కి.

తుడుం మోతింకా విన్పిస్తూనే ఉంది..

జనం ఇంకా వస్తున్నారనటానికి నిదర్శనంగా పోలీసుల చుట్టు ముసురుకున్న తలలు అంతకంతకు ఎక్కువవుతున్నాయి....

పోలీసులకు సన్నగా వెన్నుపొంటి వనుకు మొదలైంది.

"ఎవరైనా అడుగు ముందేసెదుంటే కాల్చేస్తాను" యస్. ఐ. గొంతు తడారి పోతుంటే....గొంతును ఎవరో పట్టిపిసుకుతాంటే మాటలు రాక మాట్లాడి నట్లు మాట్లాడిండు....ఆపత్కర పరిస్థితిలో కూడా పోలీసులు తమ అధికారి వింత గొంతుకకు విచిత్రంగా చూసిండ్లు.... కత్తివాటుకు నెత్తురుచుక్క లేదు మొఖంల....

అంతలోకే....

"పోలీసుల దౌర్జన్యం నశించాలి" అడివి దద్దరిల్లేలా నినదించారు చుట్టు మూగిన గిరిజనులు...

ఇంద్రవెల్లిలో జరిపినట్టు.... కనిపించినవారినల్లా పిట్టల్లా కాల్చేయాలని పించింది యస్.ఐ.కి. కాని వెనక్కి తిర్గి చూసుకుంటే నాటి ఇంద్రవెల్లిలోలాగా మందలకు మందలు పోలీసులు కన్పించలేదు.... బిక్కు బిక్కు మంటున్న

నాలుగు పోలీసు మొఖాలు.... వాళ్ళ మీదికి దునకటానికి సిద్ధంగా ఉన్న పులుల తీర్గ జనం కోపంగా చూస్తున్నారు.. యస్.ఐ.కి హఠాత్తుగా పెండ్లాం పిల్లలు ఏడుస్తున్నట్టుగా స్ఫురణ కొచ్చింది.....

"ఇంతకు మీకేం కావాలి" ఎలాగో మాటలు పెకిలించుకొని యస్.ఐ. అన్నాడు....

"అరెస్టు చేసిన మా కా(మేడ్‌ను విడుదల చేయాలి"

"లేకుంటే" యస్.ఐ....

"(ప్రాణాలతో ఎవరు ముందుకు పోలేరు" నరిగెలాగ పొడవుగా సాగ బారినట్టున్న గిరిజనుడు సు(రున ముందుకు కదిలి అన్నడు.

"ఈ లొద్దిలోనే పూడ్చేస్తాం" మరో వైపు నుండి వచ్చింది....ఎవరన్నది అర్థం కాలేదు.... యస్.ఐ.కి వాళ్ళను చూస్తుంటే నిజంగానే వాళ్ళు అన్నంత పని చేసేలా ఉన్నారనిపించింది.. నాడు ఇం(ద్రవెల్లిలో తుపాకీ గుండ్లకు లెక్క చేయక గు(రున తన పక్క నుండి గిద గిద ఉరికొచ్చి కస్సున డి.ఎస్.పి. మీదికి గొడ్డలి విసిరిన గిరిజనుడి మొఖంలా తనచుట్టు ఉన్న ముఖాలు అదే మాదిరిగా కన్పించినయి ఒక్క క్షణం,

"సరె విడ్చిపెడ్తాం....దారివ్వండి"....అన్నాడు చివరికి ఎలాగో

ఆ తర్వాత....

జీబు వాగులోంచి బయటికొచ్చింది....అరెస్టు చేసిన యువకున్ని జీపు నుండి కిందికి దించారు. పోలీసులు బిక్కు-బిక్కు మంటు ముందుకు కదిలి పోయారు....పోతూ....పోతూ యస్.ఐ. తుపాకీతో ఒక్కనైనా కాల్చాలనిపించింది. కాని పన్నెండు మైళ్ళంటా అడవిలో ప్రయాణం....ఎక్కడ ఏ క్షణంలోనైనా మళ్ళీ దాడి జరగచ్చు....రేసు కుక్కల మాదిరి....కుప్పకుప్పలుగా వచ్చి మీద పడ్తే....అనె జానకు రాగానే మళ్ళి తుపాకిని యదా విధిగా సర్దుకున్నాడు.... "ఎక్కడికి పోతరు లంజకొడుకులు ఒకొక్కన్ని తూట్లు తూట్లు పొడవను" అనుకున్నాడు,

స్పృహ కోల్పోయిన యువకున్ని ఎత్తుకొని నినాదాలు చేసుకుంటు గిరిజనులు కదిలిపోయిండ్లు....

o o o

గుట్టబోడు మీదకి సురక్షిత స్థావరానికి చేరుకున్న తర్వాత....దళ కమాండర్ అందరిని సమావేశపరిచిండు "ఇప్పుడింకా మనల్ని వెన్నంటి శత్రువు వస్తున్న జాడలింకా లేవని" నిర్ధారించుకున్నారు.... సెంట్రీని పెట్టుకొని....నీళ్ళ కోసము బయలు దేరిండ్లు....బాగా అలసిపోయిన "రవి" ఓ రాయి నీడన కూచున్నాడు....వగరుస్తూ....

బాగా పరిచయమున్న ఆబోడు మీద నీటి గుంట ఎక్కడుందో ఎరిగున్న కామ్రేడ్ ముందుకు నడుస్తుంటే అతన్ని అనుకరించి పోయింద్రు మరిద్దరు....

నీటి గుంట చుట్టు ఉన్న చెట్లు ఆకులు రాల్చటము వలన నీరంతా ఆకులతో నిండి పోయి పచ్చటి పాకురు పేరుకుంది....మరో సారి అయితే ఆనీళ్లను చూస్తేనే డోకువచ్చేది కాని.... దాన్నెంతో అపురూపంగా త్రాగారువాళ్ళు.... దాంతో వాళ్ళకు కొంత ఊరట కల్గింది....తిర్గివచ్చి వాళ్ళంతా నిద్దురపోయిండ్లు.. దాదాపుగా అందరు సొమ్మసిల్లినట్టుగా ఉన్నారు.

సెంట్రీ తనకు అనువైన స్థావరంలో కూచొని అడవిలోని ప్రతికదిలికను కనిపెడుతున్నాడు.

కొద్దిగా తేరుకున్న తర్వాత దళనాయకుడు లేచి సెంట్రీ డ్యూటికి బయలు దేరిండు...."కామ్రేడ్ నీవెళ్ళి విశ్రాంతితీసుకో"అన్నాడు ఇంతవరకు సెంట్రీని. కడుపులో ఆకలి నకనకలాడింది మొన్న సాయంకాలము అన్నం తిన్న సంగతి గుర్తు కొచ్చింది.

ఆరోజు ఓ గిరిజన గ్రామం వెళ్ళారు....అన్ని గ్రామాలలాగే అదికూడా చిన్నగ్రామమే.... పది పదిహేను గుడిసెలున్నాయి పశ్చిమాన దాదాపు ఇరువై కిలో మీటర్ల దూరము అడివిగుండాపోతే "కాగజ్‌నగర్" అనే పట్టణం తగులుతుంది. వానాకాలములో కొద్దిగా గూడెం చుట్టు ఉన్న చెలకలను దున్నుతారు. అదికూడా అడివి జంతువులు నాశనము చేసిందే కాక తాలుతప్పలు పోతె మిగిలింది రెన్నెల్లు పొద్దు గడుస్తుంది. మిగతా కాలమంతా అడివి మీదె బ్రతకాలి. అడివిలో దొరికే తునికి, రేగుపండ్లు పట్నానికి తెచ్చుకుంటారు. అవేవి దొరకనప్పుడు అడివిలో కంక బొగ్గులు కొట్టి పట్నానికి తీసుకెళ్తారు. అది కూడా ఫారెస్టు వాళ్ళ కంటపడిందో మళ్ళీ ఇంటికొచ్చేదుండదు. కేసులు జైళ్ళు

ఉన్నాయి వాళ్ళకోసము. అందుకోసము వాళ్ళు పొద్దున్నే లేచి అడివిలో తిర్గి కంక బొంగులు సేకరించుకొని రాత్రి రెండు జాములకు బయలుదేరి పూర్తిగా చీకటి తొలగకముందే పట్నానికి చేరుకొని అక్కడి కార్మిక (గుడిసె) వాడల్లో తెల్లారేసరికి దర్శనమిస్తుంటారు. ఒక్కొక్క మోపుకు పది పదిహేను బొంగు లుంటాయి. అవి అమ్ముకోగా వచ్చె ఏడు ఎనిమిది రూపాయలతో ఇంటికి తిర్గి వచ్చేటప్పుడు జొన్నలో సూకలో తెచ్చుకోవటము ఆతెచ్చుకున్నయి ఆపూట వండుకొని తిని తెల్లారి పిల్లలకు కొద్దిగా మిగిల్చి మళ్ళీ బొంగుల కోసము తిర్గి అడివికి పోవడము వాళ్ళ నిత్యకృత్యం.... అదికూడా ఫారెష్టువాళ్ళ దృష్టిలో పడకుండేనే.... అయినా మధ్య మధ్య ఫారెష్టు వాళ్ళు గూడెంలకు వచ్చి కోళ్ళు మేకలు ఎత్తుక పోతుండేవారు.

ఎప్పుడైతే ఆ ప్రాంతములో గిరిజన రైతు కూలి సంఘాలు బలపడి ఫారెష్టువాళ్ళ జులుంకి వ్యతిరేకంగా పోరాడటం జరిగిందో.... అప్పటినుండి వాళ్ళ జులుం తగ్గింది. ఈ మధ్య కాలములో బిర్లా కంట్రాక్టర్లు కాగితపు పరిశ్రమ కోసము కంక బొంగుల కొరకు అడివిని గుత్తకు తీసుకోవటము.... గిరిజనులను కూలీలుగా మార్చింది. దాంతో తక్కువ కూలిరేట్లకు వ్యతిరేకంగా పోరాటం జర్గుతుండటం....ఆసందర్భంగానే మొన్న ఆ గ్రామాన్ని చేరటము జర్గింది.

సాయంకాలము చీకట్లు ముసురుకుంటున్న వేళ. గ్రామం చేరుకున్నప్పుడు గ్రామస్తులంతా పార్టీ వాళ్ళు వచ్చిండ్లని తెలియగానె, బంగ్లాకాడ గుమికూడిండ్లు.... అ వూరి పటేల్ బడేరావు "రాం రాం" పలుకుతు వచ్చి.... కూలి రేట్ల గురించి జర్గుతున్న పోరాటం గురించి చెప్పుకొచ్చిండు....

"100 మోపుకు ఐదు రూపాయల నుండి ఏడు రూపాయలు ఇచ్చేందుకు ఒప్పుకుంటాడు కాని తొమ్మిదికి తగ్గేటలెదని మేము ఒప్పుకోలె" అన్నాడు ఉత్సాహంగా....

"అదైనా ఓమానాన విన్నాడా....పోలీసులను తీసుకొచ్చి పనుల్లోకి వస్తారా లేకుంటే జైల్లకు పోతారా అని బెదిరించిండు" అన్నాడు జంగు ముందుకొచ్చి....

"మాకు కూలి గిట్ట నప్పుడు మేము ఈ కూలి చేసేం భాగ్యం చెయ్య కేమి భాగ్యం" అన్నాడు భీమ్‌రావు అలా అన్నప్పుడు అతను వింతగా తలాడించిండు.... అడివిలో తలమీద గుద్దెలుగు కొట్టిన కాడినుంచి అతనికా వింత రోగము అలవాటయింది.

వాళ్ళ మాటలన్ని విన్న తర్వాత "మీరు సంఘటితంగా ఉంటే తప్ప కుండా విజయం సాధిస్తాం...."

"ఏమో సారు వీళ్ళు లొంగి వచ్చేలా లేరు" అన్నాడు అనుమానంగా భీమ్‌రావు....

"మొట్టమొదట ప్రతి ఒక్కడు అలాగే బెట్టుచేస్తాడు వీలై నంత మేరకు దోచుకోవాలనే చూస్తాడు....మనమింకా కొద్ది కాలము సంఘటితంగా ఉండి ఇలాగే పోరాడితే తప్పకుండా విజయం సాధిస్తాం....కోట్లు ఆర్జించి పెట్టే కాగితపు పరిశ్రమను బిర్లావాడు మూయించుకోలేడు కదా! అది కూడా మన మెంతో న్యాయమైన రేటునే అడిగాము...."

మౌనంగా వాళ్ళంతా మాటలు ఆలకిస్తున్నారు....వాళ్ళను మరింత ఉత్సాహ పరిచేందుకు "ఇది వరకు మనం ఫారెస్టు అదికార్ల "జులుం"కు వ్యతిరేకంగా పోరాడినప్పుడు మనకు ఇదే సమస్య ఎదురైంది....వాళ్ళకు వ్యతిరేకంగా పోరాడి నిల్వగలమా అని? కాని మనం సంఘటితంగా ఫారెస్టువాళ్ళ జులుంకి వ్యతిరేకంగా ఎదురు నిల్చినప్పుడు వాళ్ళతోక ముడిచిండ్లు....మనం న్యాయం కోసము పోరాడుతున్నాము కాబట్టి మన విజయం సాధిస్తాం...." ఆ మాటలకు వెంటనే బదులుగా....

"అవును ఫారెస్టు వాళ్ళు మునుపటిలా జులుం చెలాయిస్త లేరు" అన్నాడు చీకట్లో కూచున్నతను....ఆ చీకట్లో అతను స్పష్టంగా కన్పించలేదు.

"అవును ఈరోజు ఫారెస్టు కంట్రాక్టర్లకు వ్యతిరేకంగా కూలి పెంపు కోసము పోరాడుతున్నాము....వాళ్ళు తప్పకుండా లొంగివస్తారు....అంతే కాదు మన సమస్యలు అన్ని తీరాలంటె భూమి కావాలి....మనం దున్నుకునేందుకు భూమిలేనంత కాలము మన సమస్యలకు పరిష్కారముండదు....ఇప్పటికి చాల గ్రామాలల్ల భూమికోసము పోరాటము జర్గుతున్నది....అడివిని నరికి భూమిని

సాపు చేసుకుంటున్నరు....పంటలు పండించు కుంటున్నరు....మీరు కూడా అడివిని నరకాలి....భూమిని సాగులోకి తెచ్చుకోవాలి"

భూమి మాట వినగానె అందరి మనసుల్లో కొత్త ఆశలు చిగుర్చాయి....

"అయితె మేం కూడా అడివిని నరుకుతాం"

"తప్పకుండా నరకాలి....తొలకరి చినుకులు పడేసరికి భూమిని సాపు చేసుకోవాలి"

"పోలీసులు వస్తే"

"వారికి వ్యతిరేకంగా పోరాడాలి....అప్పుడే మనం భూమిని దక్కించు కోగలము"

వాళ్ళ మనసుల్లో గూడుకట్టుకున్న భయాలను ఒకొక్కటే వాళ్ళు బయట పెట్టిండ్లు....వాటన్నిటికి ఓపిగ్గా సమాదానాలు చెప్పేసరికి అప్పటికే చాల పొద్దు బోయింది....అందరి కడుపుల్లో అకలి నక నక లాడింది....అందరు వెళ్ళ పోయేందుకు సిద్దమైయిండ్లు.... ఓ బక్కపలచని వాడు.... "మీరీ రాత్రి మాయింటికి భోజనానికి రావాలి దాదా" అన్నాడు....అంతవరకు అతను ఒక్క మాటయినా మాట్లాడలేదు.

"లేదు లేదు మాయింటికి తీస్కపోతా" అన్నాడు బీమ్‌రావు యధావిదిగా తలాడిస్తూ.

"ఎవరింటికి వద్దు మాఇంటి కాడె అన్ని ఏర్పాట్లు చేసిన" అన్నాడు పటేలు బదేరావు....

కాని కరువు కాలములో ఒకరింటనె దళము మొత్తంగా తిండి పెట్టటము కష్టమే....ఒకవైపు ఆకలి తీర్చుకోవటం కోసము గునుగు గింజలు....ఓంద్ర కాయలు మరియు అడివిలో దొరికె విషపూరితమైన దుంపలు విషం పోయేంత వరకు నీళ్ళలో నానబెట్టుకొని పొట్ట నింపుకుంటున్న కరువుకాలములో.... కష్టమేమరి "సరె మిమ్మల్ని నారాజు పరచుటమెందుకు ... మాదళ సభ్యులు ఒక్కొకరింటికి ఇద్దరేసి చొప్పున వస్తాము" అని అందరిని సంతృప్తి పరచాలని అన్నాను.

వాళ్ళందుకు ఒప్పుకున్నారు.

తను, అందరికంటే చిన్నవాడు రవి కల్సి కొత్తగా భోజనానికి పిల్చిన అతని వెంట వెళ్ళారు....అతని పేరు హన్మంతు....అతను తోవ పొడుగుతా.... మాట్లాడుతూనే ఉన్నాడు.... తన రెండు తల్లిలేని పిల్లమేకల గురించి.... వాటి తల్లిని ఫారెష్టు వాళ్ళు చంపుకొని తిన్న సంగతి కాన్నించి మొదలుకొని అడివిలో పుల్లలేరుకోవటము ఇదివరలో ఎంత కష్టమైందో....తన రెండు దున్నలు షావుకారు ఎలా వశపరుచుకున్నది....చెపుతూనే ఉన్నాడు.... అది మొత్తంగా ఒక్క హన్మంతు బాధే కాదు మొత్తం గిరిజనుల బాధ....వినే ఓపిక ఉంటే ప్రతి గిరిజనుని జీవితము ఒక కన్నీటి సముద్రము....

గుడిసె ముందు మంచము వాల్చి కూచోమన్నడు....అకాశంల నెలవంక తూర్పు దిక్కుగా ఎగబాకుతుంది....మసక వెలుతురు గూడెంకు అస్పష్టమైన ఆకారాన్నిస్తుంది గూడెం చుట్టు ఉన్న అడివి చిక్కటి నల్లరంగు పూసినట్టుగా ఉంది....ఆ మసక వెన్నెల్లో చెట్ల పైకొసలు చీకటికి వెలుతురుకు మధ్య సరిహద్దు రేఖ లాగున్నాయి.

మంచములో కూసున్నకాడికె రెండు రాతెండి కంచాల్లో అన్నము తెచ్చి చేతికిచ్చిండు....ముద్దకారము....కొద్దిగా పప్పు....నిజంగా అపురూపమే ఆభోజనము....రవి ఆవురావురు మంటు ముద్దలు కలుపుతున్నాడు....

"హన్మంతు మరి నీవు తినవా" అన్నాను అన్నము కలుపుకుంటు....

"మీరు తినండి సారు....మేము తర్వాత తింటాము" అన్నాడతను.

"అదే అందరము కల్సి తిందాము" అన్నాను మళ్ళ

"కంచాలు వేరె లేవన్నా....మీరు తిన్నాంక మేం తింటాము" అంది గుడిసెలో నుంచి హన్మంతుభార్య....

మాటవచ్చిన వైపు దృష్టిసారిస్తే గుడిసె దర్వాజ కాడ నిలుచున్న చిన్న అస్పష్టమైన ఆకారము కనిపించింది... దిసమొలగా ఉన్న మూడు నాలుగేండ్ల పిల్లవాడు మావైపే పరీక్షగా చూస్తున్నట్టు కనిపించాడు.

"రా బాబు" అని పిలిచాను.

వాడొక క్షణంసేపు వస్తామా? వద్దా అన్నట్టు తటపటాయించిండు.... మళ్ళీ రమ్మనిపిలిచిన తర్వాతగాని మేము కూచున్న మంచము కాడికిరాలేదు....

మసక వెన్నెల వెల్గులో సన్నటి పుల్లలాంటి కాళ్ళు చేతులు ఆడించుకుంటు దగ్గరగా వచ్చిండు....

"నీ పేరు" అన్నాను మచ్చిక చేసుకుందామనే ఉద్దేశంతో....

బదులేమి పలుకకుండా నేను కలుపుతున్న అన్నము ముద్దకేసి చూస్తుండి పోయిండు....

"బువ్వ తింటావా" అన్నాను....

ఆః అన్నట్టుగా.... గుడిసెకేసి, తండ్రికేసి చూసిండు.... హన్మంతు "ఇంట్లోకి పోబిడ్డా అవ్వ అన్నము పెడ్తది" అంటు దగ్గరికి తీసుకొనేందుకు ప్రయత్నించిండు....కానిఆ పిల్లవాడు మంచము కోడును పట్టుకొని కదల్లేదు....

"పర్వాలేదు ఉండనియ్" అంటు మంచము మీద పక్కగా కుచుండ బెట్టుకున్నాను.... నేనో ముద్ద అన్నము నోట్లో పెట్టుకొని పిల్లవాడి చేతులో మరో ముద్ద పెట్టాను. వాడు చప్పుక్కున నోట్లో పెట్టుకొని బాగా ఆకలిగా ఉన్నా డేమో మళ్ళీ చెయ్యి సాపిండు....

హన్మంతు మేకలను కట్టేసేందుకు ఎస్గుకాడికి పోయిండు....

"బువ్వ తిన్లేదా" అన్నాను.

లేదన్నట్టు తలూపిండు....

"అదేః అవ్వ అన్నము పెట్టలేదా?"

"పొద్దటి సుండి అమ్మ....నాన బొంగులు అమ్మకరాను పోయిండు వచ్చినంక వండి పెడ్తాసంది.... బువ్వ అయినంకనో....సార్లు తిన్నంక పెడ్త సంది....నాక్తో ఆకలి బాగా అయితంది" అన్నాడు వచ్చీరాని మాటలతో.... నాకా మాట లింటుంటే కండ్లపొంటి నీళ్ళు జల జల కారినయి....అన్నము తింటున్న రవి నోట్లోని ముద్ద నోట్లనే ఆగిపోయింది....

మేకను కట్టేసి వచ్చిన హన్మంతు "రా బిడ్డా ఎత్తుకుంటాను అంటు చేయిసాపిండు" మా దగ్గరి నుండి తీసుకపోయే ఉద్దేశంతో....

"పర్వాలేదు ఉండనియ్ హన్మంతు" అంటు వారించాను అప్పటికే మారవి ఆపిల్లవాన్ని తనతొడమీద కూచుండబెట్టుకొని..అన్నముకల్పి ఆపిల్లవాడి నోట్లో పెడుతున్నాడు....

"ప్రజలే నిజమైన విప్లవకారులు" అన్న మావో సూక్తి నా బుర్రలో మెదిలింది.... రవి మొఖంలోకి చూస్తే సరిగ్గాఅతను నాలాగే ఆలోచిస్తున్నట్లుగా అనిపించింది ఆ మసక చీకట్లో....

అది మొన్న జరిగిన సంఘటన.... నిన్నటి రోజుంతా ప్రయాణము ఇవ్వాళ ఉదయమే మరో ఊళ్ళో భూస్వామి అక్రమంగా ఆక్రమించుకున్న భూమి గురించి ప్రజా పంచాయతి. పంచాయతి జర్గుతుండగానే.... ఊళ్ళోకి పోలీసులు వస్తున్న సంగతి సెంట్రీ కనిపెట్టిండు.... జాగ్రత్త కోసము హెచ్చరికలు సాగినయి.... మరో వైపు నుండి తిరోగమించాల్సి వచ్చింది.... బహుశా పోలీసులకు భూస్వామియే సమాచారము అందించి ఉండాలి.... లేదా మరేదో కారణం ఇంత వరకు ఏ సంగతి తెలియదు.... ఆ విషయమింకా పరిశీలసలో ఉంది.. అక్కడి నుంచి పారిపోయి ఇక్కడికి వచ్చిన సంగతి గుర్తుకొచ్చింది....

కామ్రేడ్స్ వైపు చూసాను దాదాపుగా అందరు నీరసపడిఉన్నారు.. ఆకలి అందరిని దహించివేస్తున్నది.... కడుపులో ఏదైనా పడ్డెగాని కదలలేని స్థితిలో ఉన్నట్టు అన్పించింది..

దళము మొత్తంగా చూస్తే అద్దసేరు.... జొన్నలున్నాయి.... అవిఅయినా ఎంతో కంట్రోలుగా వాడితేనే మిగిలినవి.... అది తప్ప తినేందుకు మరొకటి లేదు....

"కామ్రేడ్స్ మనమీ పూట ఇక్కడే భోజనము చేసి బయలుదేరితే బాగుంటుందేమో.... మీ అభిప్రాయము" అడిగాడు కమాండర్ అందరికేసి చూస్తు....

"అలాగే కామ్రేడ్" నల్లగా లావుగా ఉన్న దళ సభ్యుడు అన్నాడు.... అతను రైతు కామ్రేడ్. నలభై సంవత్సరాలుంటాయి కావచ్చు దళములో అందరికంటె పెద్దవాడు.... లేచి ఎండు పుల్లల కోసము కదిలిండు.... సహాయం కోసము ఇంకో కామ్రేడ్ లేస్తె.... "పర్వాలేదు కామ్రేడ్ నీవు విశ్రాంతి తీసుకో అడివి అడివంతా ఎండిపోయివుంది.... నిముషములో పట్టు కొస్తాను" అంటు వారించి ముందుకు కదిలిండు....

నిప్పు రాజేసుకున్న తర్వాత గిన్నెలో ఉన్న కాస్త జొన్నలు పోసి.... అవే పాకురుపట్టిననీళ్ళు పోసిండ్లు.... ఆకలికి అందరి నోళ్ళల్లో నీళ్లూరినయి....

ఎత్తైన స్థలములో తనకు అనువైన స్థలంలో కూచున్న సెంట్రీ....అడివి నాలుగు చెరుగులా కళ్ళు పొడుచుకొని చూస్తున్నాడు....అతని దృష్టి నుండి ఏ ఒక్కటీ తప్పుకోవడములేదు చెట్టు, పుట్ట, తుప్ప....పక్షి....ఎక్కడ ఏ అలికిడి ఆయినా కనిపెట్ట గల్గేలా తన యావద్‌శక్తి కండ్లల్లో నింపుకొని చూస్తున్నాడు....

పొయ్యిమీద మక్కజొన్నలు తుకతుక లాడుతున్నాయి.

దూరాన ఎక్కడో పీడ కదిలింది.

కదిలిన నీడవైపు మెడ సారించిండు సెంట్రీ....ఎత్తుగా పెరిగిన ఎండి పోయిన టేకుచెట్ల మాటున ఏదో కదిలివస్తున్న దృశ్యము....పరీక్షగా చూస్తే మందలా వస్తున్న కాకిబట్టల పోలీసులు కన్పించిండ్లు. ఎటువైపు పోతున్నది కనిపెట్టిండు మరింత పరీక్షగా.... అంతవరకు చెట్ల చాటునుండి ఫారెస్టు వాళ్ళు ప్లాంటేషన్ కోసము వదిలిన మైదానముల కొచ్చిండ్లు....ఇప్పుడు స్పష్టంగా కనిపిస్తున్నారు....మొత్తము పన్నెండుమంది ఉన్నారు. ఇద్దరు ఇనస్పెక్టర్‌లలా గున్నారు. వాళ్ళకు ముందు భాగాన ఎవరో తెల్లబట్టలాయన నడుస్తున్నాడు.... ఎవరైంది స్పష్టంగా కనిపించటంలేదు....వారి వెనుక పోలీసులు తుపాకులు పొజిషన్‌లో పట్టుకొని వస్తున్న దృశ్యం కళ్ళబడింది. వాళ్ళు తామున్నవైపే వస్తున్నట్టుగా గుర్తించి పాములా రాళ్ళమాటున పాకి దళమున్న చోటి కొచ్చిండు.

వచ్చేసరికి....

అప్పుడే దించిన గిన్నెలో వేడివేడిగా మక్కజొన్న గుడాలు....అందరి నోట్లు నీళ్ళూరిస్తున్నాయి....అవురావురుమంటూ ఆకలిచే దహించివేస్తున్న వారికి వాటిని చూడగానే ఆకలి మరింత పెచ్చరిల్లింది. ఎవరితట్లు వాళ్ళుపట్టుకున్నారు.

"వీటికి కాస్తకారము....ఉప్పు కలుపుకుని ఉల్లిగడ్డ అంచుకు పెట్టుకుంటే బలెపసందుగా ఉంటాయి" ఉడికి ఉబ్బి ఉన్న పసుపుపచ్చని మక్కలను చూస్తు గుటకలు మింగుతూ ఓ కామ్రేడ్....

"డియర్ కామ్రేడ్ ఉప్పులేక వారంరోజులైంది" అన్నాడింకో కామ్రేడ్ కాస్త నిరుత్సాహ పరుస్తూ

"కొద్దిగా కారపుపొడి అయినా పసందే" అన్నాడు ఇందాకటి కామ్రేడ్.

అందరు నవ్వుకున్నారు.

వాళ్ళ మాటలిన్న సెంట్రీ....పొంచిఉన్న ప్రమాదము గురించి తెలియ పర్చాలి....తప్పదు....అనుకొని దళ కమాండరును సమీపించి "ఇటువైపే పోలీసులు వస్తున్నారు కామ్రేడ్" అన్నాడు శాంతంగా.

అందరు ఒక్కక్షణం నిశ్చేష్టులై గంభీరులైండ్లు....క్షణాల మీద వాళ్ళు యుద్ధానికి సిద్ధమైండ్లు రైఫిల్సు సరిచేసుకుంటు. కమాండరు సెంట్రీతో రాళ్ళను మాటుచేసుకొని కదిలిండు దూరంగా బోడును సమీపిస్తున్న పోలీసులు కనిపించిండ్లు....నిదానించి చూస్తే సరిగ్గా వాళ్ళు బోడును సమీపిస్తున్నట్టేఉంది. తిరిగి దళాన్ని సమీపించేసరికి అప్పటికే వాళ్ళంతా సామాను సర్దుకొన్నారు. అసలెప్పుడు అక్కడ మానవసంచారమేలేన్నట్టుగా సర్దిండ్లు....అంతవరకు వంట చేసుకోవడమువల్ల ఏర్పడ్డ బూడిదైనా మిగలకుండాచేసి కమాండర్ ఆజ్ఞకోసము తయారుగున్నారు.

"కామ్రేడ్ మనం వెంటనే ఇక్కడి నుంచి రిట్రీట్ కావాలి" ఆతను ఆజ్ఞాపించిందే తడవు.

ఎవరి సామాను వాళ్ళు భుజాన వేసుకున్నారు....
వేడిగిన్నింకా పొగలు కక్కుతూనే ఉంది....

దానివైపు ఒక్కక్షణం విచార దృక్కులతో చూసిన రైతు కామ్రేడ్.... దాన్ని పట్టుకోవటానికి చెయ్యిసాపిండు. అది సురుక్కుమంది. తువ్వాలతో దాన్నిఒడిసి పట్టుకొని వాళ్ళతోపాటు కదిలిండు....

పశ్చిమ దిక్కున వంగిన సూర్యుని వేడికిరణాలు మొఖము మీద పడు తుంటే వాళ్ళు బోడువెనుకవైపు నుండి దట్టమైన అడవుల్లోకి ప్రయాణము సాగించిండ్లు....

సూర్యాస్తమయంఅయ్యే వరకు వాళ్ళ ప్రయాణము అలా కొనసాగు తూనేఉంది. పశ్చిమాన ఆకాశము నెత్తురు కక్కుతుంది. సంధ్య వెలుగు కూడా అస్తమించింది. చిక్కటి చీకటి చెట్ల మాటునుండి నలుచెరుగులా వ్యాపిస్తుంది. ఎక్కడో దూరాన జంతువుల అరుపులు విన్పిస్తున్నాయి. అలసిపోయి అందరు ఆయాసంగా కాళ్లీసి కాళ్ళువేస్తున్నారు.

అంతవరకు గిన్నెను చేతితో పట్టుకున్న కామ్రేడ్ ఎండిన ఆకులను చుట్టగా మల్చి నెత్తిమీద పెట్టుకున్నాడు. ఎండిపోయిన సెలయేటి ఇసుకలో

## నా ప్రియమిత్రులారా

చిన్న

నేనా విశాల ప్రాంగణాల నుండి
లోతైన స్వేచ్ఛ నుండి
భ్రమల గాజుగదిలోకి వచ్చానీ రోజు
అందుకే
పాటల్ని పారేసుకు వెతుకుతున్నా
మాటల్ని మరిచి వెంపర్లాడుతున్నా
చరిత్ర నిండుగా
ఎర్రని రక్తం మరకల్లో నా వాళ్ళను
పోగొట్టుకున్నానని విలపిస్తున్నా
కాని నేస్తం

---

కూరుకపోతున్న పాదాలను ఈడ్చుకుంటు నడుస్తు....కాలుకేదో తగిలి ఒక్కసారిగా తూలిండు....అ ఊపుకు నెత్తిమీది "గిన్నె" ఇసుకలో దొర్లింది.... అందులో గింజలన్ని ఇసుకలో కలిసినయి....

అందరూ ఒక్కక్షణమాగిండ్లు.

కమాండరు చుట్టూ కలియజూసిండు....చాల దూరము వచ్చామని గ్రహించిండు. చీకట్లో శత్రువింకా చొచ్చుకొస్తాడన్న నమ్మకములేదు. ఇప్పటికే శత్రువు తిరుగుప్రయాణం సాగించు తుంటాడని నిర్ధారించుకొని కొద్దిసేపు అక్కడ విశ్రాంతి తీసుకోవటం ఏమంత ప్రమాదము కాదనుకొని "కామ్రేడ్స కాసేపు విశ్రాంతి తీసుకొని బయల్దేరుతాము" అన్నాడు.

మౌనంగా అందరు "సరె" అన్నారు.

సెంట్రీ డ్యూటీ మీదికెక్కిన కామ్రేడ్ సెలయేటి గట్టుమీద తుప్పల మధ్య తనకు అనువైన స్థలము నుండి చీకట్లను చీల్చుకుంటు చూస్తుండిపోయిండు....

చల్లటి ఇసుకలో కూలబడిపోయిన మిగతా కామ్రేడ్స్‌లో....ఆకలి దప్పిక నీరసము ఒకదానికి ఒకటి పోటీ పడుతున్నాయి. ఆ చల్లటి ఇసుకలో దొర్లిపోయిన గింజలను చేతులతోతడిమి ఒక్కొక్క గింజనే గిన్నెలో వేస్తున్నాడు.

నువ్వు కత్తి అంచుల మీద నిలబడి
నా యీ జీవన్మరణ రేఖల్లో
మృత్యువు కనురెప్పల మాటున దోబూచులాడుతూ
తిరిగి నాకు ప్రాణం పోస్తున్నావు
ఇపుడు నేను ఏ నాటికీ మరిచిపోలేని జ్ఞాపకాల్ని పాడుతాను

  

నుదుటి చెమటలో
సూరీని ప్రతిఫలనం
బోడి గుట్టల కావల తుంపర
ఆకాశానికీ భూమికీ మధ్య పరచుకున్న సింగిణి
సనసన్నని వర్షపు జల్లు మొఖాల మీంచి జారి
నోట్లో కొచ్చిన ఉప్పటి చెమట రుచి
ఆకుడొప్పల్లో పిల్లలు ఏరుకొచ్చి
మనకిచ్చిన తెల్లటి తునికి పలుకులు
ఎర్రని ఎండలో ఆరేసిన శరీరాల్తో
మనం ఒకరి పక్కన ఒకరం
తోడుగా నీడగా
భుజాలకి వేలాడే బందూకులూ
శిరస్సుని నిమురుతున్న అడవి తల్లీ
యేటివొడ్డు ఇసుక మేటల్లోంచి నడిచి
తుప్పల్లోంచి ఒదిగి
జనం మనకు తెచ్చిన జొన్న అంబలి, సంకటి, కారం
అన్నిటికి మించి వాటిల్లో రంగరించిన
ఆప్యాయత గుర్తుంది
కామ్రేడ్
గోదావరి మిలమిలల అలలపైన
చేప పిల్లలు కదలాడే వినూత్న సాయంసంధ్యల్లో

నువ్వు కవిత్వం చెప్పే వాడివి
గొంతెత్తి రాగాలాపన చేసేవాడివి
అవి నిశ్చయంగా పురోగమనం గూర్చే వుండేవి

  

ఇసుకనేల యేటి ఒడ్డున
అలసి సొలసి నిద్దురోయి లేవలేని రేయి
నువ్వు నా వెన్ను తట్టి
భుజం పట్టి నిలబెట్టేవాడివి
మాటల్లో కథల్లో గాథలలో
ప్రపంచ విప్లవాన్ని కళ్ళముందు కదిలించేవాడివి
అలా అలా
గోధూళి వేళ - కనుమరుగుల్లో
నడచీ, గడచీ పల్లెకెళ్లే వాళ్ళం
జనం మన చుట్టూ గుమికూడేవాళ్ళు
నెమ్మదిగా రహస్యంగా మాట్లాడేవాళ్ళు
వాళ్ళెంత ఉత్సాహంగా అమాయకంగా
ప్రశ్నించే వాళ్ళో !
మనం నేర్పిన విషయాల మూలంగా
వాళ్ళు ప్రతి దాన్ని ప్రశ్నించడం
ప్రతి దాన్ని తర్కించడం నేర్చుకున్నారు
మనం మాట్లాడి ఆడి పాడి
నమ్మకాల ప్రోదిని కూర్చే వాళ్ళం
ఆలోచన తేనెటీగల్ని లేపే వాళ్ళం
పోరాటాల అగ్నిని అంటించే వాళ్ళం
గుర్తుంది

  

ఒక రోజు
ఆ నులి వెచ్చని రాత్రి
హంతకులు కామ్రేడ్‌ని హత్య చేశారు
నువు వల వలా ఏడ్చావు
విస్మయంగా వున్న నాకు
వేలాది యువకుల ఆశల్ని మోసుకొచ్చిన వాడ్ని గూర్చి
కోట్లాది ప్రజల ఆరాటాన్ని మోసుకొచ్చిన వాడ్ని గూర్చి
ఒడిని అమరవీరుల రక్తాన్ని ఒరుసుకొచ్చిన వాడ్ని గూర్చి
మన సహచరుని గూర్చి తెలియజెప్పావ్
అన్నా కామ్రేడ్ నా మిత్రుడా
మనం ఒకే మార్గంలో
ఒకే బడిలోంచి వచ్చాం

ఔను నిజం
అందుకే
దీర్ఘమైనదీ అతి క్లిష్టమైనదీ అయిన
ఆశయాన్ని మోస్తున్నవాడా !
చీకటి వెలుగుల సంధ్యల్లో
సుదీర్ఘ రాత్రి కటిక చీకటిపై
కత్తిని ఝళిపిస్తున్న వాడా !
కత్తి అంచు మీద నిలబడ్డవాడా !
మానవుడా ! ఉన్నతుడా !
పర్వత శిఖరాగ్రాల త్యాగమై వెలుగై
నిలిచిన వాడా
నా ప్రియతముడా ! కామ్రేడ్ !
నేనూ నీ వెంటే వుంటా.

(నేను ప్రపంచంలో అత్యధికంగా ప్రేమించే నా మిత్రులకి)

# సమిధ

సాంఖ్యాయన

ఉదయం ఏడు గంటలవుతూంటే విశాలమైన హాలు ఆవులించి కళ్ళుతెరిచింది. పనివాడొకడు గది తలుపులు తెరిచి కర్టెన్లు పైకి వేలాడేశాడు. బయటి కిటికీలు తెరిచాడు. కిటికీలు తెరవగానే కిటికీలో పదిపదిహేను ముఖాలు ప్రత్యక్షమయాయి టీవీలోలాగా. పనివాడు గద్దించాడు.

"తెల్లారిందా ఇప్పుడే?" ఆ ముఖాల్లో సగం మాయమయాయి అక్కణ్ణించి.

"సార్ వస్తాండా?" ప్రశ్నవేసిన తలని చూశాడు పనివాడు. "ఇంక గంటపైమున్నది సారును జూడాల్నంటే" అన్నాడు మూలనుంచి చీపురుతీస్తూ.

చీపుర్ని చూస్తూనే తలలు మాయమైనాయి. పనివాడు గదంతా చిమ్మి కిందపరిచి వున్న పరుపుల మీది దుప్పట్లుదులిపి మళ్ళీ సరిగాపరిచి బాలీసుల్ని సరిచేసి ఫాన్ ఆన్‌చేసి లోపలికి వెళ్ళిపోయాడు.

పాలరాయి గచ్చుపరిచిన ఆ గదిలో కూచోడానికి కుర్చీలకి బదులు పరుపులు బాలీసులు మాత్రమే ఉంటాయి. అయితే వాటిమీద కూచోడానికి ఎవరైనా సరే జంకుతారు. అందువల్ల అవి మాయటం, ఉతకటం అనేది అట్టే ఉండదు. ఆ గది గంభీరతకి మరో కారణం కూడా వుంది. గదికి నాలుగు వైపులా ప్రపంచంలో ప్రస్తుతం ఎగ్జిస్టెన్సులో వున్న హిందూదేవుళ్ళందరి ఫోటోలు వున్నాయి. వాళ్ళ పటాలకి వాళ్ళ ఇష్టాలనిబట్టి చమ్కీదండలు, మల్లెదండలు, మొగలిరేకుల దండలు వగైరాలున్నాయి, పటాల మూలలకి అగరొత్తుల మరకలు కాల్చిన వాతల్లా జిడ్డోడుతూ వున్నాయి. ముఖాలకి గంధం, కుంకుమా పూసివుండి మరుగునపడ్డా ఇతర అవయవాల వల్ల ఫలానాఫలానా దేవతలని తెలుస్తోంది. వీటన్నిటికి చివర్న మార్వాడీ టోపీ, కుంకుం బొట్టూ వున్న మరోమనిషి ఫోటోవుంది. దానికింద "గురూజీ" అని రాసివుంది హిందీలో,

మొత్తానికి ఆ గది మహారాజాగారి దివాన్‌గారి కచేరీ గదిలావుంది. సరిగ్గా ఏడుంపావు అవుతూండగా బిళ్ళకట్టు ధోతీ, బనీనూ ధరించిన ఒక పొడుగాటి సన్నని మనిషి ఆ గదిలోకి ప్రవేశించాడు. అతడి క్రాపు వెనక్కి దువ్వి వుంది.

ముఖాన ఎఱ్ఱని తిరుచూర్ణం బొట్టువుంది. అతను అలౌకిక దృష్టివున్నవాడిలా ఆ గదిలోకి ప్రవేశించి దీర్ఘంగా నిట్టూర్చి ఫాన్ ఆఫ్ చేశాడు. తర్వాత లక్ష్మీదేవి పటానికీ, శ్రీకృష్ణుడి పటానికీ ఓ రెండు అగరొత్తులు వెలిగించి మూలల్లో గుచ్చాడు. లక్ష్మీదేవి పటానికి తైలదీపం వెలిగించి కర్పూర హారతి ఇచ్చాడు. ముందు వాయవ్య దిశగా వున్న ఆంజనేయుడికి సాష్టాంగ దండ ప్రమాణం చేశాడు. తర్వాతలేచి అతడి వైపు చేతులు జోడించి ఏదో ప్రార్థన పది నిమిషాల పాటు చేశాడు. పక్కనే ఉన్న సరస్వతికి ఓ దండం మాత్రం పెట్టి లక్ష్మీదేవివైపు తిరిగి మరో సాష్టాంగ దండం పెట్టి మరో పది నిముషాలు మంత్రాలు చదివాడు. తర్వాత వినాయకుడూ, శంకరుడూ, శ్రీరాముడూ, మహా విష్ణువూ, అందరికీ నమస్కార మాత్రపు మర్యాదలుచేసి ఆఖర్న శ్రీకృష్ణ భగవానుల వారివైపు తిరిగాడు. వారి ఫోటోలు చాలా ఉన్నాయి. శ్రీకృష్ణ-రాధ, వస్త్రాపహరణ దృశ్యం, కాళీయ మర్దనం, బృందావనకృష్ణ, పార్థసారథికృష్ణ, విశ్వరూప కృష్ణుడు, ఇలా అనేక రకాలు. వీటన్నిటికీ తలా ఐదు నిమిషాల చొప్పున కేటాయించి ఆఖర్న మూడు ఆత్మ ప్రదక్షిణాలుచేసి తర్వాత పరుపుల మీద కూచున్నాడు. అక్కడేవున్న హిందీ దిన పత్రికనొదాన్ని చేతిలోకి తీసుకున్నాడు.

తర్వాత సరిగ్గా అదే వేషంలో వున్న మరో మనిషి ఆ గదిలోకివచ్చాడు. అతడు కాస్త పొట్టిగా వున్నాడు. అతడి ముఖం ఏవో దురూహలు చీకట్లలా పరుచుకుని ముఖాన్ని మలినం చేసినట్టుగా ఉంది. అతడు గదిలోకి రాగానే పరుపు మీద ఓ దగ్గిర పడివున్న ఐదుపైసల నాణెం కన్పించింది. చటుక్కున దాన్నందుకుని బొడ్లో దోపుకుని లక్ష్మీదేవి పటం వైపు తిరిగి సాష్టాంగ దండ ప్రణామంతో తన పని ప్రారంభించాడు. అంతకు ముందు సన్నటి పొడుగాటి వ్యక్తి చేసినట్టే ఈ మనిషి గూడా దేవతార్చన కార్యక్రమం సాగించాడు.

కిటికీలోంచి ఈ తతంగాలన్నీ గమనిస్తున్న జనం విసుక్కున్నారు. తమ మాటలు వినపడే అవకాశం లేదనుకున్న వాళ్లొకరిద్దరు "వీని శాననపు నోట్లె నా........" అని తిట్టుకుని బీడీలు వెలిగించారు.

వాండ్లిద్దరూ నగరంలో లీడింగ్ లాయర్లు. అన్నదమ్ములు గూడాను. వాళ్లెంత ఆచార పరాయణులంటే కోర్టులో తాగడానికి మంచినీళ్ళు కూడా ఇంటి

నుంచే మరచెంబులో తీసుకువెళతారు. బయట వచ్చి మంచినీళ్ళు కూడా ముట్టని మార్వాడీ బ్రాహ్మలు!

కాసేపు అన్నదమ్ములిద్దరూ పేపరు చదివాక లోపలి గదుల్లోకి వెళ్ళిపోయారు. అప్పుడు ఎనిమిదిన్నర అవుతోంది. ముందుగదిని చిమ్మిన నౌకరు తలుపుతెరిచి బయటికోసారి తొంగి చూసి మళ్ళీ లోపలికి వెళ్ళిపోయాడు.

బయటి జనం ఆ చల్లని శీతాకాలపు ఎండలో ఎండ కాగుతూ చుట్టూ బీడీ కాలుస్తూ కూచున్నారు తప్ప లోపలికి వచ్చి కూచోలేదు.

"ఈ ముండకొడుకులకింత భక్తేందయా?" ఒక కోమటి షాహుకారు పక్కవాణ్ని అడిగాడు.

"ఏమయో సౌకారీ! నువు అయ్యప్ప ఏషం ఏత్తలేవా? గట్లనే ఇదొక ఏషం!" ఇంకోడన్నాడు.

"ఏత్తె ఏశినగని మరీ గింత ఇదాసయ?" షావుకారు అన్నాడు.

"ఎవరితీరు వాల్లది" మరో మధ్యవర్తి భాష్యం.

"సాగుతె అన్నీ నడిపిస్తరు."

"ఇంతకు వీల్లు మల్ల ఎప్పుడు బయటికత్తరో గద!" ఓ పల్లెటూరి ఆసామీ అన్నాడు.

"తొమ్మిది కానిదే రారు ఇంక లోపలి అగ్రల పూజలులేవు?" ఒకడన్నాడు.

ఇంతలో ఇద్దరు యువకులు ఆ వీధిలోకి ప్రవేశించారు.

"అగో మున్షీలు వచ్చిన్రు" ఒకడన్నాడు.

ఇద్దరు వకీలు గుమాస్తాలు జనాన్ని సమీపిస్తుండగానే జనం వాళ్ళని ఎదుర్కొని "మా ఫైలు జర ముందుగాల పెట్టు" అని ఎవరికి వారే బతిమాలుకున్నారు. ఆ మున్షీలు ఇవన్నీ విననట్టే "అరె ఉండుం డ్రివయా" అని జనాన్ని తోసుకుని వెళ్ళారు గదిలోకి. ఆ సరికే వాళ్ళ జేబుల్లోనూ, చేతుల్లోనూ కొన్ని నోట్లు నిండాయి. అక్కడున్న జనమంతా ఆఇద్దరు లాయర్ల క్లయింట్లు.వాళ్ళలో దరిద్రుని నుంచి లక్షాధికార్లదాకా ఉన్నారు.

పావుగంట తర్వాత మున్షీలు బయటికివచ్చి "బయటనే వుంటారా! సార్లు వచ్చి కూసున్నరు రాండ్రి" అన్నారు.

క్లయింట్లందరూ గుమ్మం బయటనే చెప్పులు విడచి లోపలికెళ్ళారు. లోపలికి వెళ్ళగానే కుర్చీలో కూర్చున్న లాయరు కన్పించాడు. రెండు చేతులూ జోడించి నమస్కారం చేశారు అందరూ. ఒక ముస్లిం వ్యక్తి మాత్రం సలాం చేశాడు. లాయరు అతన్ని గుర్రుగా చూశాడు. అతను సలాంచేయటం ఒక తప్పు. వకీలుకి రెండుచేతులా నమస్కారంచేయాలి ఎవరైనా సరే. ఎందుకంటే అది మన సాంప్రదాయం. సాంప్రదాయపు వ్యతిరేకత వకీలు సహించడు. బూట్లున్నాయి, అది రెండోతప్పు. పవిత్రమైన ఆ గదిలోకి ఎవరూ చెప్పులతో రాకూడదు. నిజానికి ఆ వకీళ్లిద్దరూ వాళ్ళగదిలో కూచునివుండగా చూస్తే మందిరంలోని మహంతుల్లా వుంటారుతప్ప వకీళ్ళలా వుండరు.

మున్షీ ముస్లిం వ్యక్తిని బయటికి లాక్కెళ్ళాడు. అందరివైపు చూస్తూ "ఎవరో బీడీ తాగి వచ్చినరు?" అన్నాడు ముఖంచిట్లించి. చాలా కాలంగా ఇక్కడే స్థిర పడ్డందువల్ల తెలుగుబాగానే మాట్లాడుతారు అన్నదమ్ములిద్దరూ కాస్త ఔత్తరాహిక యాసతో.

ఆ మాటలకి అక్కడున్న ఐదారుగురు మూతులు ముడుచుకున్నారు. లాయరు విసుక్కున్నాడు. "పొగ తాగటంమంచిది కాదు. అది మన ఆచారం కాదు." అని బోధించాడు. అక్కడున్న అందరూ తలాడించారు.

"ఊఁ ఏమి షావుకారిగారూ పైసల్ తెచ్చినరా?" అన్నాడు షావుకారిని చూస్తూ లాయరు.

"అయ్యా, తెచ్చినగని పని ఐద్దంటారా?" షావుకారు సంశయించాడు

"అంతా పైసల్ పైసల్ తోటి ఉన్నది. అక్కడ క్లర్కుకు ఇయ్యాలె. బెంచి గుమాస్తాకు ఇయ్యాలె. జడ్జిసాబ్‌కు నేను స్వయంగ ఇస్త. మీకేం ధోకాలేదు. పైసాఇస్తే కానిదిలేదు" అన్నాడు లాయరు.

షావుకారు నోట్లు సమర్పించుకున్నాడు. అతన్ని వెళ్ళమని ఇంకో అతన్ని "సాక్షులను సంపాదించినవా?" అనడిగాడు.

వాడు తెల్లమొగం వేశాడు. "నాకూ నాపెళ్ళానికీ మధ్య సాక్షులెవరుంటారండీ?" అన్నాడు.

"మరి ఆమె నగలన్నీ తన తల్లిగారిచ్చినవే అంటే ఎట్ల?" లాయరు అడిగాడు.

"నగలు నేనే కొన్నానండి. బిల్లు ఉంది నా దగ్గర" అన్నాడతను.

"బిల్లు మీద పేరు నీదే కాని డబ్బు ఎక్కడిది? అది నేనే ఇచ్చినా నంటే?" లాయరు గారి ప్రశ్నకి తలపట్టుకున్నాడా మనిషి.

"అందుకే చెప్తున్న. ఆనగలూ, వాటితోపాటు పదో, ఇరవయో వెయిలా నగదూ తీసుకుని ఆ మనిషి ఇల్లు విడిచి పోయిందని కేసు పెడదాం" లాయరు గారి సలహాకి తలూపాడు ఆ వ్యక్తి.

"రెండ్రోజుల తర్వాతరా" అని అతన్ని పంపించాడు.

మరోవైపు తిరిగి "మీరిచ్చిన కాయితం కోర్టులో రెండేళ్ళ కిందటే ప్రొడ్యూస్ చేసినట్టు రికార్డు పుట్టించాను. పైగా జడ్జీ గూడా అప్పటివాడే అవటం వల్ల తిప్పలేమీ కాలేదు. కానీ కట్నం చాలదంటున్నారు" అన్నాడు.

లోపల ఈ విధంగా జరుగుతూంటే బయట ఒక కారు ఆగింది. దాన్లో నించి గుమ్మటంలాంటి ఓ వ్యక్తి, లావుగా పొడుగ్గావున్న మరో వ్యక్తి దిగారు. ఇద్దరూ బిళ్ళకట్టు ధోవతీలు లాల్చీ ధరించారు.

గుమ్మటం లాంటి వ్యక్తి మెడలో రుద్రాక్షలు, నుదుట కుంకం బొట్టూ వున్నాయి. తల అంట కత్తెర వేయించి వుంది. ముఖం విశాలంగా విశాఖ సముద్రపొడ్డులా వుండి ఆ ముఖంలో పెదాలు ఓరుగల్లు మట్టికోట గోడల్లా పొడుగ్గానూ, మందంగానూ వున్నాయి. నోటినిండా తమలపాకు ఉండి "ళ" కార యుక్తంగా ప్రతి మాటనీ ఉచ్ఛరిస్తున్నాడు. ఆయన పేరు సదాహారరావు. ఎప్పుడూ దేన్నో ఒక దాన్ని హరాయించుకోందే నిద్ర పట్టదతనికి.

ఇంకోవ్యక్తి పొడుగాటి లాల్చీ మోకాళ్ళదాకా ధరించాడు. అతని కనుబొమలు దుబ్బుగా వుండి కళ్ళ మీదికి పడుతున్నాయి. అతని ముఖంనిండా అన్ని కోరికలూ తీరిన ఋషులకుండే సౌమ్యతవుంది. ఐతే ఋషుల్లో విశ్వామిత్రుడి స్వభావం అతడిది.

ఆ ఇద్దరూ అన్నదమ్ములు. ఇద్దరూ వకీళ్ళే.

కారు దిగాక ఇద్దరు మార్వాడీ లాయర్ల గదుల్లోనూ వున్న క్లయింట్ల రద్దీని చూశాక తమ్ముడు వకీలు నొసలూ, పెదవీ విరిచి

"శీళ్ళంతా క్ళయింట్ళేళా!" అని తమలపాకు యాసతో ఆశ్చర్యపోయాడు.

"దాంట్లో ఆశ్చర్యమేముంది? షావుకార్ల వ్యాజ్యాలన్నీ ఇక్కడికే రెండువేల స్టాండర్డు కేసులున్నాయి ఇద్దరికీ కలిపి. ఇవిగాక నూర్లో సూటే భయ్యో సుప్రీంకోర్టు కేసులు!" అన్న వకీలు అన్నాడు.

త.వ. ఉక్కిరిబిక్కిరయి తమలపాకుని ఉమ్మేశాడు. "ఏమిటీ?" అని ఆశ్చర్యపోయి బుర్రలో కంప్యూటర్ కన్న వేగంగా లెక్కలు చేసేశాడు.

"రెండువేల కేసుల్ని నెలకొక్కటి సాల్వ్‌చేసినా నూట అరవై సంవత్స రాల ఆరునెల్ల పని! పోనీ ఇద్దరు కల్పిచేసినా ఎనభై మూడు సంవత్సరాల మూడునెలల ప్రాక్టీసు. కేసుకి అధమపక్షం వెయ్యిరూపాయిల ఫీజు వేసు కున్నా ఇరవై లక్షల రూపాయల ఆదాయం" అన్నాడు.

పొడుగాటి మనిషి—అన్న వకీలు—నవ్వాడు. "అది ఇప్పటి పరిస్థితి. తర్వాత ఎంత పెరుగుతుందో?" అన్నాడు.

"అదీ సంగతి! ఈ ముండాకొడుకులు నాకు కొన్ని కేసులు ఎందుకు రిఫర్ చేస్తున్నారో ఇప్పుడర్థమైంది. ఇవన్నీ వీళ్ళ జీవితకాలంలో సాల్వ్‌చేస్తారో లేదో కాబట్టే నాకూ కొన్ని పంపటం" త.వ. అన్నాడు.

"అవి చచ్చుకేసులై వుంటాయి. మంచి ఆదాయం వచ్చే కేసుల్ని వాళ్ళే ఉంచుకుని ఉంటారు" అన్నాడు అ.వ తనరోజుల్ని గుర్తు తెచ్చు కుంటూ. ఆ మార్వాడీ వకీళ్ళిద్దరూ అ.వ. దగ్గిరే జూనియర్లుగా చేశారు.

"బాసూ! ఇందాక సుప్రీంకోర్టు కేసులన్నావ్, అవి ఈ వెధవలెలా వాదిస్తారు? వీళ్లేదే!" అన్నాడు తవ.

"సరి! మేమే వాదిస్తున్నామని క్లయింట్లకి పోజిచ్చి అక్కడెవడికో కేసుని అప్పగించి వస్తారు. హైకోర్టులోనే వీళ్లదంటే సుప్రీంకోర్టులో వీళ్ళ నెవడు రానిస్తాడు అదంతా టెక్నికన్నమాట!" అవ నవ్వాడు.

"ఎంతయినా, నాయకత్వాన్నీ, పలుకుబడినీ ఇంత వాడుకోవటం నైతిక పతనం కాక మరేమిటి? ఛఛ హిందూ ధర్మాన్ని చివరికి ఇలాగూడా వాడుకునే వాళ్ళు తయారయారు!" తవ నిట్టూర్చాడు.

"ప్రతి ధర్మమూ ఎవడికో ఒకడికి ఉపయోగపడేదే! ఇక లోపలికి వెళ దాం" అని అవ దారితీశాడు.

o o o o

ఆ గదిలో పరుపుల మీద ముగ్గురు వకీళ్ళూ, మరో ఇద్దరు షాపుకార్లూ, ఇద్దరు యూనివర్సిటీ రీడర్లూ, ఒక వడ్డీ వ్యాపారీ, ఇంకో ఇద్దరు ముగ్గురు నగర ప్రముఖులూ కూచుని వున్నారు.

ముగ్గురు వకీళ్ళలో ఇద్దరు మార్వాడీ వకీళ్ళే. పోతే మరొకాయన తవ గారు. అవగారు కాంగ్రెసు మనిషి కనుక వీళ్ళతో కల్సి ఉంటాడు తప్ప మీటింగులకిరాడు.

పెద్ద మార్వాడీ సన్నటి కీచుగొంతుకతో ప్రారంభించాడు.

"పన్నెండు వందల సంవత్సరాల కింద ఆది శంకరాచార్యులవారు చేసిన మత సమీకరణ లాంటిది ఇయ్యాళ మళ్ళీ జరుగుతున్నది. ఇది భారతదేశచరిత్ర లోనే పవిత్ర కార్యం. ఈ కార్యనిర్వహణ కోసం మనం మన శక్తి వినియోగించి హిందూధర్మప్రతిష్ఠాపన చెయ్యాలె" అన్నాడు.

అందరూ తలూపారు. అది పీఠాధిపతుల ఆజ్ఞలాంటిది.

హిందూ మత ఐక్యతకోసం మన పరిషత్ తలపెట్టిన ఈ యజ్ఞ నిర్వహణ కోసం దగ్గర దగ్గర సలభై లక్షల దాకా ఖర్చవుతుందని అంచనా. పోతే అన్ని ఖర్చులూ పోగా రెండు కోట్ల రూపాయలు నిధిగా సేకరించాలని కేంద్ర సంస్థ ఆశిస్తున్నది. దానికిగాను మనం మన జిల్లాలో శక్తి వంచన లేకుండా కృషి చేయాలె"

తవ పెదవివిరిగించి తలూపాడు. అతనికి పాత సంఘటనలన్నీ గుర్తొచ్చాయి. వసూలు చేసిన మొత్తాల్లో భాగాలు ఎలా మాయమయామో స్ఫురించాయి. ఐనా తెలియనట్టుగా అన్నాడు.

"నిశ్రేయస సిద్ధిః యత్ర తత్ర ధర్మః – ధారణా ధర్మ ఇత్యాహుః ధర్మయతే జనః కాబట్టి మనం స్వలాభ కాంక్షలేని కార్యములు నిర్వహించాలె. అప్పుడే అక్కడ ధర్మం నిలుస్తుంది. ఆ ధర్మం మనిషిని కాపాడుతుంది. అట్టి కార్యములు నిర్వహించి జనహితాన్ని కోరటం మన పరిషత్ లక్ష్యం".

పెద్ద మార్వాడీ, చిన్న మార్వాడీ లిద్దరూ తవని ఓరగా చూశారు. వాళ్ళకి ఎక్కడ తగలాలో తగిలింది. స్వధర్మ నిధనం చేసే ధూర్తుడి లాగు కన్పించాడు. త.వ. వారికి. వీడితో లాభంలేదని ఇతర్లవైపు తిరిగి పెద్ద మార్వాడీ అన్నాడు.

మన జిల్లాకు కనీసం పది లక్షల కోటా ఉన్నది. అది వసూలు జెయ్యాలె. ఎట్లయినసరే. షావుకార్లు, ఇతర గృహస్తులు అందరినీ అప్రోచ్ కావాలె. ఊరూరికీ ఒక హుండీ పెట్టి డబ్బు దాంట్లో వెయ్యమని చెప్పాలె. హిందూ ధర్మం గొప్పతనం గూర్చి ఊరూరా బుర్ర కథలు, ఉపన్యాసాలు ఏర్పాటు జెయ్యాలె. వారికి తిండీ ప్రయాణం ఖర్చులూ లోకల్ కార్యకర్తలు చూసుకోవాలె. మనకు మంది తక్కువేం లేరు"

"మరి వాళ్ళకి ఏమన్నా ఇయ్యాల్నా?" వడ్డీ వ్యాపారి అడిగాడు.

"హిందూధర్మం కోసం పని చెయ్యటం మన కర్తవ్యం, దానికి ప్రతిఫలం అడుగుతారా? స్వయం సేవకులన్న మాటకు అర్థం ఏమిటి?" చిన్న మార్వాడీ అన్నాడు.

అందరూ సంతృప్తిగా తలాడించారు.

తవ గొంతెత్తాడు.

"నహి కశ్చిత్ క్షణమపి జాతు తిష్టత్యా కర్మకృత్యో—ఏ ప్రాణీ ప్రకృతి సిద్ధంగా కర్మ చెయ్యక ఏ క్షణమూ ఎలా ఊరుకోదో అలాచేసే కర్మ హిందూ ధర్మ స్థాపన కోసం చెయ్యటం ప్రతిష్టాకరం. మన ధర్మం అది. ధర్మోరక్షతి రక్షితః గనుక వారు ప్రతిఫలాపేక్ష లేకుండా క్రియాశీలురు కావాలి" అన్నాడు. యూనివర్సిటీ పండితులు వినుక్కున్నారు. "బోడిపాండిత్యం వీడూనూ. లింగ ధారుడు మాకన్న ఎక్కువ పండితుడా? పోతన ఉత్సవాల్లో సిల్కులాల్చీ కవి ముందు వాగిసట్టనుకుంటున్నాడా ఏమిటి? తడాఖా చూపుదాం" అనుకున్నారు.

వారిలో గొగ్గిపళ్ళ బట్టతల లీడరు గొంతు సవరించుకున్నాడు. ఆయన యూనివర్సిటీకి పాంటూ, షర్టూ, మీటింగులకి లాల్చీ, ధోతీ వేసుకునివస్తాడు. శ్రీవైష్ణవుడు.

"మహాజనో యేన గతః సపంథా-అన్నట్టు మహాజనులు నడిచిందే మార్గం, కనుక హిందూమత పునర్వ్యవస్థీకరణకోసం భగవద్రామానుజులవారు చెప్పిన దగ్గరినుంచి శ్రీ అరవిందులవారి బోధనలన్నీ ఈ సందర్భంగా మనం వెలుగులోకి తీసుకువచ్చి హైందవధర్మాన్ని నూతన మార్గాల్లోకి ప్రవేశపెట్టడం మన ధర్మం కాగలదు" అన్నాడు.

మతపరంగా తాను ఆధునికుణ్ణని ఆయన భావిస్తూవుంటాడు. దుర్గేశ్వర స్వామి ఉలిక్కిపడ్డాడు. ఈ సమావేశంలో స్మార్తులు, వైష్ణవులు ఎవణ్ణి వాడు గొప్పచేసుకుంటుంటే తానేనా ఊరుకోవటం!

"మహాశివుని విహారస్థలమైన హిమాలయాల నుండి శివజటాజూట వాసిని గంగను కొనితెస్తున్న ఈ రథయాత్ర మన జాతికెంతో పుణ్యప్రదాయిని. కాబట్టి దీన్ని పరమ శివకార్యంగా ఎంచవలసి ఉంటుంది. దీనిలో ప్రతి హిందువూ పాలుపంచుకునేటట్టు చెయ్యటం మన కర్తవ్యం" అన్నాడు.

రామమూర్తికి ఒళ్లు మండింది. ఈ ఆరాధ్యుడు తన గొప్పతనాన్ని ప్రదర్శిస్తున్నాడే?

"పరమపవిత్రమైన గంగ మన ఆర్యసమాజానికి జీవప్రదాయిని. వేద భూమియైన అఖండ భారతవర్షంలో గంగను వేదాలు సైతం కీర్తించాయి. ఆ గంగ ఏమతంవారి సొత్తూకాదు. హిందువులందరికీ, ఆ మాటకివస్తే ఏ దేశ నివాసియైనా గంగా దర్శనంతో పాపవిముక్తి పొందుతాడు. అట్టి గంగ - వేద వినుత గంగ మనముంగిటకు రావటం మన జన్మనూ జాతినీ తరింపచెయ్యటానికే ఈ పవిత్రకార్యంలో అందరం భాగస్వాములమే."

రామమూర్తి మాటలు కాస్తవేడిగా అన్పించాయి అందరికీ. పెద్దమార్వాడీ, చిన్నమార్వాడీలిద్దరూ ముఖాలు చూసుకున్నారు.

* * *

రాబోతున్న ధర్మ గంగాజల రథం, భారతమాతా రథం ఆగేందుకు వేదికనూ' పందిళ్ళనీ అక్కడ నిర్మిస్తున్నారు. కొంత మంది కూలీలు అక్కడ పనిచేస్తున్నారు. పవిత్ర గంగాజలం ఉంచే వేదికను అస్పృశ్యులైన మాలలు నిర్మిస్తున్నారు, వారికి ముత్తడు మేస్త్రీ. వాడికి నడివయసు దాటింది. శంఖు విగ్రహంలావున్న మనిషి. మహా భక్తుడు. శ్రీరంగనాయకులపైన వాడికి విప రీతమైన భక్తి. ఎక్కడ హరికథవున్నా, వైష్ణవ సంబంధమైన ఏ వుత్సవం జరుగుతున్నా వాడు కూలీపని సైతం మాని అప్పుచేసుకుని ఆ వుత్సవాలకి హాజరవుతాడు. వాడికి ఈ వేదిక నిర్మించే పని దొరకటం పూర్వజన్మ సుకృ తం అని భావిస్తున్నాడు. రెండు రోజుల్లో రాబోతున్న శ్రీ విష్ణుపాదోదకమైన

గంగాజల భాండాన్ని ఉంచే వేదిక సర్వసుందరంగా ఉండాలని వాడి ఊహాశక్తి అంతా వెచ్చించి దాన్ని నిర్మిస్తున్నాడు. వాడు విశ్రమించక, ఇతర్లని విశ్రమించనీయక అనుకున్నదానికన్న త్వరితంగా పనిని పూర్తి చేయిస్తున్నాడు.

ఆ సాయంత్రం వాడు పనిలో నిమగ్నుడై ఉండగా శాయన్న వచ్చాడు. శాయన్న సాలెవాడు. సంఘ ప్రచారకుడిగా అతడు ఊరిలో కొందరికి తెలుసు.

వచ్చీ రాగానే ముత్తడిని పిలిచి పని ఎంతవరకయిందో కనుక్కునే శాయన్న నాలుగురోజుల్నించి రాలేదు. ఇవాళ వచ్చి ఓ వైపున్న రాళ్ళగుట్ట మీద అన్యమనస్కంగా కూచోడం ముత్తడు చూశాడు. "ఏంది ఇట్లున్నడు?" అని ముత్తడు శాయన్న దగ్గరకు వెళ్ళాడు.

"దండాలయ్యా!" ముత్తడి గొంతువిని శాయన్న తలతిప్పిచూసి దీర్ఘంగా నిట్టూర్చాడు.

"ఎట్లనో ఉన్నరూ?" ముత్తడు అడిగాడు.

సాయన్న నవ్వి మరో మారు దీర్ఘంగా నిట్టూర్చి ఊరుకున్నాడు. ముత్తడు పట్టువదలక పదే పదే అడిగాడు.

"ఇట్లున్నరేందయ్యా!"

శాయన్న మరోసారి నిట్టూర్చి "ముత్తా! మనందరం ఒకటే నంటావా?" అనడిగాడు. ముత్తడు నివ్వెర పోయాడు. ఈ ప్రశ్న వస్తుందని వాడు ఊహించలేదు. "ఏందయ్య! అట్లడిగితిరి?" అన్నాడు.

"ఏమీలేదురా! ఏకాత్మత అన్నది పుస్తకాలల్ల ఉన్నదా లేక నిజంగ సంఘంలో ఉన్నదా తెల్సుకుందామని అడిగిన" అన్నాడు శాయన్న.

"ఈ ముచ్చట ఎందుకచ్చిందయ్యా!" ముత్తడన్నాడు.

శాయన్న చెప్పాడు.

"అరె ముత్తా! నేను సంఘ ప్రచారకుణ్ని. హిందువులంతా ఒకటని నేను చెప్పుతున్న. కానీ నువ్వు నా యింటికి వస్తే గడపబయట వుండి నన్ను పిలువాలె. అప్పుడు నేనే బయటికి వచ్చి నీతోటి మాట్లాడి పంపిస్త. అట్లనే నాకన్న పెద్దకులం వాడు ఎవడితోనైనా నేను మాట్లాడబోతే ముందు గదిలో

మాట్లాడి నన్ను బయటికి పంపిస్తరు, ఇంత తేడా వున్నదిరా. ఇగ మనందరం ఒకటి ఎట్లవుతం?" శాయన్న మాటలకి ముత్తడు నివ్వెరపోయాడు.

పరమధర్మ ప్రచారకుడైన శాయన్నగారేనా ఇలా మాట్లాడుతున్నది?

"అయ్యా! తమరేదో బాధపడుతున్నట్టున్నది. అది నాకు తెలువదిగని మన మతం, ధర్మం చెప్తున్నదాన్ని మనం పాటించాలెగద. లేకపోతె ధర్మం వదిలినవాళ్లం కాదూ?" అన్నాడు,

"అరే ముత్తా! ధర్మం ఏమన్నదిరా? మానవులందరిదీ ఒకే జాతి అన్నది. కులం ఒకటన్నదా? మతం ఒకటన్నదా? కులాలువేరే ఉన్నయన్నది మతమా ధర్మమా? నువు మాలోనివి, నేను సాలోణ్ని. మతం ప్రకారం నేను హిందువును. నువుగూడ హిందువే. మన మార్వాడీ వకీలుగూడ హిందువే. కానీ నా ఇంట్లకు నిన్ను నేను రానియ్యను. తన ఇంట్లకు నిన్నూ, నన్నూ మార్వాడి వకీలు రానియ్యడు, ఎందుకు?"

శాయన్న ముఖంనిండా చెమటనిండింది. అతని మనస్సంతా కల్లోలసముద్రంలా వున్నదని గ్రహించాడు ముత్తడు.

"ముత్తయ్యా! నిన్నింటాకటి నుంచి అరే ముత్తా అని పిలుస్తున్న అది నువ్వు గమనించలేదు. అది నాకూ ఇన్ని రోజులు గమనింపుకు రాలేదు. మన బతుకులల్ల ఇదంత ఇంకిపోయింది. నేను నిన్ను రారా అంటే ఏమనిపించలేదు నీకు, నాగ్గూడ! అదే నువ్వు నన్ను రారా అంటే నాకు బాధ కలుగుతది. కోపం వస్తది. అట్ల నువ్వనెటానికి వీలులేదు. నాకున్నది. నాకెందుకున్నదంటె మన మతం, ధర్మం నాకా అధికారాన్నిచ్చినయి, నీ నుంచి పీకివేసినయి!" అన్నాడు శాయన్న.

"ఇప్పుడవన్ని ఎందుకు లేన్రి!" ముత్తడు వినయంగా వారించాడు.

"నీకు తెల్వది. మన మతం, ధర్మం నన్ను గొప్పోణ్ని జేస్తున్నాయనుకున్న. మొదలు ఈ బడిపంతులు నౌకరికోసం, తర్వాత దాన్ని నిలుపుకుంటానికి ఈ ధర్మం పట్టుకున్న. గాయత్రీ మంత్రం నరిచి మునీశ్వరున్నై పోయిన్ననుకున్న. ధర్మం, ధర్మం అని బడిల శిన్నపోరగాళ్లకుగూడ నా పైత్యమంత ఎక్కిచ్చిన. నేను ధర్మం, మతం అంటున్నకొద్దీ మందికి దూరమైతాన్నని తెలుసుకోకపోయిన" అన్నాడు శాయన్న విచారంగా.

"అయ్యా! ఇయ్యాల మీ మనుసు బాగలేనట్టున్నది. ఏమన్న అసుకోనిది జరిగిందా?" ముత్తడు అడిగాడు.

"అసుకోనిదేం గాదు. కాని అప్పుడు నాకు తోసలేదు. ఇప్పుడు అని పిస్తున్నది. నువు హిందూ ధర్మంలో అంటరానివానివి. నేను శూద్రున్ని. నిన్ను పూర్తి కావళా వృత్తికే ఉపయోగించుకుంటరు. నీకన్న నేను కొంత నయం గనుక నన్ను మరికొంచెం ఎక్కువ పనులకు వాడుకుంటరు. కాని ఇద్దరిది పై కులాల వారిసేవే" కాయన్న అన్నాడు.

ముత్తడు నాలిక పళ్ళసందున ఇరికించి ముక్కు మీద వేలేసుకుని "ఇన్ని తెల్సిన మీరు ఇట్ల మాట్లాడుతె అర్తమున్నదా?" అన్నాడు.

"అదే జెప్పబోతున్న. హిందూ మతంల ఇన్ని తేడాలుంటె హిందువు లంత ఒకటెట్లయితరు? అసలు మతం మనుసులను కలుపుతదంటె నాకు నమ్మకం పొయింది. నిన్నటి దాక ఈ ముచ్చట్లు నమ్మినోన్ని, అందరికి జెప్పి నోన్ని నేనేనా అనిపిస్తాంది!" కాయన్న అన్నాడు.

"శ్శె శ్శె! ఆ రంగని దయ గావాలె గని మనసులతోటేందండి?" ముత్తడన్నాడు. కాయన్న నవ్వాడు "రంగనికి గూడ మనసుల దయగావాలె! వానికి గుడి కట్టేదెవడు? కావలు దీసేదెవడు? అదంత పోనీగని ఇప్పుడు నువు జేస్తున్న ఈ ఏర్పాట్లన్ని ఎందుకో నీకెరికేనా?" అన్నాడు.

"ఎందుకేందండీ? గంగారతమొత్తాంది గద. భారతమాత గూడరాబట్టె: అందుకే ఇదంత" ముత్తడు అమాయికంగా అన్నాడు.

"భారతమాత! మట్టికి గూడ మనిషి రూపముంటదా? సరె! ఉంట దనుకో- ఎట్లుంటది? ఊహించి చెప్పు!"

"ఎట్లుంటదంటే....ఎట్లుంటదంటే...." ఊహ అందక ముత్తడు కాయన్న ముఖంలోకి చూసి నవ్వేశాడు.

కాయన్న జేబులోంచి ఒక కాగితం తీసి ఇచ్చాడు. అది ఒక పత్రికలోని కటింగ్. "ఇదెవరో చెప్పు" అన్నాడు కాయన్న. ఆ కాగితాన్ని పరకాయించి చూసి" ఇది కాలికాదేవి పోటో గాదండి!" అన్నాడు ముత్తడు

"సరిగా చూడు!"

"అదేందండి అట్లంటరు? సింపమెక్కి ఉన్నది. శేతుల ఏవో అతార లున్నయి. కాలికాదేవే. అదేంది కిరీటం గూడ ఉండె!" ముత్తడు ధృవీకరించాడు.

"ఇదే మన భారతమాత!" శాయన్న అన్నాడు.

"కాలికాదేవి భారతమాత ఎట్లయిద్దండి?" ముత్తడు నోరు వెళ్ళబెట్టాడు.

"ఎట్లయిద్దంటె చేస్తె అయిద్ది. ఆ నడుమ పోతన పండుగ జరిగింది సూశినావు! మవు సీల్లు గూడ మోశినవు! అగో ఆ పండుగల పోతన బొమ్మ పెద్దది గీయిచ్చిన్రు. ఆ పోతన్న అసెటాయినె పచ్చి నాలుగైదు వందలేండ్లు అయితాంది. ఇప్పుడాయినె బొమ్మ గావాలె గాఖటి గీపిచ్చిన్రు. అది ఎట్లున్న దెరికేనా? మన నరహరిరావు సాబ్ లేడా ఢిల్లీల? గాయినె పోలికలతోని ఉన్నది. ఎందుకంటె ఆ మీటింగులు జరుగటానికి ఆయినే ముఖ్యకారణం కాబట్టి మెహర్బాని కోసం అట్ల గీపిచ్చిన్రు. బొమ్మ నొసట బొట్టుగూడ ఆయినె మత ప్రకారం పెట్టిన్రు. గట్లనే ఈ భారతమాత బొమ్మగూడ ఎరికేనా?" అన్నాడు శాయన్న.

"మరిగంగారతం సంగతేంది! అది నిజం గంగ కాదా?" ముత్తడడిగాడు. "నిజం గంగే! ఐతే ఏంది? నీరు సహజసిద్ధమైంది. దానికి లేనిపోని పవిత్రత అంటగట్టి మాయ జేస్తున్నరు. పారే నీల్లు శుభ్రంగ ఉంటయి. నిలువ నీల్లు మురిగ్గుంటయి. అంతేగని నీరెక్కనైనా నీరే. గంగకున్న తేటదనం వర్ధన్నపేట వాగుకూ్కడ ఉంటది" అన్నాడు శాయన్న.

"ఏందండి మీరు ఇయ్యాల పూర్తి కిలాఫ్‌గ మాట్లాడుతాంద్రు? గట్ల ఎక్కన్నన్న జరుగుద్దా?" అన్నాదు ముత్తడు కొంచెం నొచ్చుకుని.

"ముత్తయ్యా! నీకన్న ఎక్కువ మంది పెద్దల తోటి తిరిగినవాన్ని, ఎక్కువ పుస్తకాలు చదివినవాన్ని! నాకే ఇట్ల అనిపిస్తున్నదంటే నేను ఎంత తెలుసుకోని ఉండాలె? బోధ్ తాలూకా ఎరికేనా? ఆదిలాబాద్ జిల్లాల ఉన్నది. ఏదో పనిమీద నేనక్కడికి ఓసారి పోయిన. మన సంఘపు పోరగాళ్ళు అక్కడ గంజాయి తాగుతాన్రు. గొండ్లోల్లను బెదిరిచ్చి ఈతకల్లు తాగుతాన్రు. వీల్లు మనోల్లే కదా అని అక్కడి సావుకార్లు ఈ పోరగాల్లందరికి అడిగినంత

సందాలిస్తరు. వీల్లు అదంత మింగి కూసుంటరు. ఏదన్న మీటింగుల లొల్లి బెట్టటానికి, భారత్‌కుజై అనెటానికి తప్ప ఈ కోతుల మంద ఎందుకు పనికి రారు. మనోల్లని కడుపుల బెట్టుకునుడే గని మన మీద మనకే నమ్మకంలేదు"

శాయన్న మాటలు ముత్తడు నమ్మలేదు. "ఎహె మరీ ఇచ్చంత్రం జేత్త రేముండి? గంత అన్నాలంగుంటదా మన సంఘం?" అన్నాడు.

"నేను సూశినయి గాబట్టి నీకు నమ్మకం లేదు సరె! ఈ వూర్లెనే, నీ ఎదురుగ్గ ఉన్నది జెప్పుత. అది గూడ గాదంటవా? సూద్దాం!" అని శాయన్న మీద వున్న అంగవస్త్రింతో ముఖం తుడుచుకుని మళ్ళీ అన్నాడు.

"మన వకీల్ సాబ్ సదాహరరావు ఉన్నాడు గద! ఆయన కతేంది? ఆయినేమొ మన సంఘంల ఉంటడు. ఆయినె అన్నదమ్ము లిద్దరేమొ – ఒకడు ఎప్పుడు స్టాండర్డుగ కాంగ్రెస్ పార్టీల వుంటడు, ఇంకోడు ఏది అధికారంల వుంటె దాంట్ల వుంటాంటడు. మొత్తానికి ఎవలధికారంల కచ్చినా అన్నదమ్ముల ముగ్గురికి లాభమే. ఇక అన్నదమ్ములల్ల ఇప్పుడు అధికారపార్టీ ఎమ్మెల్యేగ ఉన్నోడు తక్కువ కులపు ఆమెను పెండ్లి జేసుకున్నడు. ధర్మంచెడ్డదన్నం. అందరం ధర్మద్రోహి అని తిట్టినం. కాని ఈ అన్నదమ్ములిండ్లల్ల ఏ పండుగైనా, ప్రయోజనమైనా. ఆమెను వదిలి వీన్ని ఒక్కన్నే పిలుస్తరు. వీడు సంకలు, పిర్రలు ఎగరేసుకుంటబొయి సుట్టాలతోని బాగ తినివస్తడు. ఏ శాస్త్ర ప్రకారం వాన్ని పిలుస్తరో, ఏ ధర్మ ప్రకారం వీడు పోతడో ఎవనికి తెల్వది. ఎవరడుగరు. ఆమె అక్కరలేదుగని సుట్టాలకు వీడు గావాలె. వీడు ఎమ్మెల్యే గాకుంట వట్టోడయితె పిలుద్దురా? ఆమెకు జరిగె అవమానంల తనకు గూడ భాగమున్నదని వానికి తెలుస్తలేదు. ఇవన్ని జూస్తాంటె హిందూ ధర్మం అన్నదిలేదని నాకు అనిపిస్తాంది" శాయన్న నిట్టూర్చాడు.

"తమ మాటలు నాకు అర్థమైతలేవయ్యా! మీకేందో గట్టి దెబ్బే తగిలింది" ముత్తడు తేల్చేశాడు.

"అవును. నాకు గట్టి దెబ్బే తలిగింది. కని ఆ దెబ్బతోని ఇన్ని రోజుల పైత్యం వదిలింది." శాయన్న తువ్వాలుతో ముఖం తుడుచుకున్నాడు. మళ్ళీ చెప్పటం సాగించాడు.

"మొన్న నాల్గు రోజుల కింద పొద్దుగాలనే లేశి సూర్య నమస్కారాలు చేసుకుంటాంటే మన మార్వాడీ వకీలు ఇంట్ల పనిజేశెటోడు సైకిలు మీద ఆదర బాదర వచ్చిండు. వచ్చి "సార్లు తొందరగ రమ్మంటాంౘ్రు" అన్నడు. నేను వెంటనే సైకిలెక్కి వాని వెంట బొయిన.

అక్కడ అన్న వకీలు, తమ్ముడు వకీలు, మార్వాడీ వకీల్లిద్దరు, అధి కార పార్టీ ఎమ్మెల్యే ఇంక శానామంది సావుకార్లు వున్నరు. అందరికీ నమస్కారం జేసి నిలబడ్డ.

అన్న వకీలు మొకం శివుని మూడో కన్ను తీర్గమండుతున్నది. తమ్ముడు వకీలేమొ నిప్పులు తొక్కిన శివసత్తి తీర్గ ఆ గోడ నుంచి ఈ గోడకు ఈ గోడ నుంచి ఆ గోడకు తిరుగుతున్నడు.

శానసేపు ఎవరు మాట్లాడలే. నాగ్గూడ అదంత ఆశ్చర్యంగ ఉన్నది. ఏంది ఇదంత? అనుకుంటుండగానే లోపలి గది నుంచి పరమ శివమూర్తి తీర్గ ఉన్న ముసలాయినె ఉరికొచ్చి "వీడేనా ఆ భ్రష్టమ్ముండాకొడుకు?" అన్నడు.

ఆ ముసలోడు నా మీదబడి మొకం గోర్లతోని గీకినంత పనిజేశిండు. "దరిద్రపు గాడిదా! కులహీనుడా! ధర్మహీనుడా! నీకు కైలాసం దొరకదుగాక దొరకదురా అప్రాచ్యుడా!" అని తిట్టి "ఛీ ఛీ! ఈ కులహీనుణ్ని ముట్టుకున్నం దుకు మళ్ళీ స్నానం చెయ్యాలి" అని లోపలి అర్రలకు బొయిండు. నేను కింద పడబోయి నిలువరించుకోని "ఏందండీ ఇదంత? నన్ను ఈయనెవరో ఇట్లతిడుతున్నడు? అని అడిగిన.

పెద్ద మార్వాడీ నా వైపు కొండెంగ తీర్గచూసి "హిందూ ధర్మకీ పవిత్రతా ఔర్ శ్రేష్ఠతా కీ ప్రచారక్ హోకే ఐసీ స్వధర్మ నిధన్‌కీ తుమ్ కైసే తయార్ హువే?" అన్నడు.

నాకేం అర్థమైత లేదు. "అసలేం జరిగిందండి?" అనడిగిన.

"జాతికే భ్రష్ఠు పట్టిన ఈ రోజుల్లో మనలాంటి వారు చెయ్యగూడని పనిచేశావు" తమ్ముడు వకీలు ఉరుకులు ఆపి అన్నడు.

"తుమ్ ధర్మ ఔర్ జాతీకీ ద్రోహీ బన్ గయే, భారత్‌మే ఐసీ లోగోంకో స్థాన్ నహీ హై. హిందుస్థాన్ హిందువోంకా హై, కిసీకా బాప్‌కా మాల్ నహీ!" పెద్ద మార్వాడీ అన్నడు.

ఇంతల లోపలి నుంచి ఇందాక నన్ను బరబర గికిన ముసలోడు తడి బట్ట గట్టుకోని విభూతి పూసుకోని మళ్ళా వచ్చిండు.

"ఏమిటి ఏమంటాడు గాడిదకొడుకు?" అన్నడు నన్ను జూస్తూ.

"అదేదో మీరే అడగండి" అన్న వకీలు అన్నాడు.

"ఏరా భ్రష్టాకారప్పీనుగా! ఇంత అఘాయిత్యానికి ఎలా పాల్పడ్డావురా? మన ధర్మాన్ని చేజేతులా నాశనం చెయ్యటానికి నీకు మనసెలా వచ్చింది? ఆ శివుడు నన్ను క్షమిస్తాడా అసలు?" ముసలోడు మళ్ళా నా మీద పడబొయిండు గని పెద్ద వకీలు ఆపిండు.

"ఊరికే స్నానం చేస్తె సన్నిపాతం వస్తుంది" అన్నడు.

"జరిగింది జెప్పి తిట్టరాదుర్రి. నా వల్ల జరిగిన అపరాధమేంది?" అని వినయంగ అడిగిన.

"నీకొడుకు సాంబడు, మా దయవల్ల యూనివర్సిటీలో సీటు సంపాదించుకుని ఇవాళ నా కొంపకే ఎసరు పెట్టాడ్రా!" ముసలోడు నందీశ్వరుని తీర్గ రంకె వేసిండు.

నేను ఆశ్చర్యపోయి "అయ్యా! అట్ల ఏదన్న జరుగుతె వానికి నేను చెప్పి మాన్పిస్త. ఇంతకు ఏం జేశిండు?" అన్న.

"ఏం జేశాడంటావేమిట్రా దున్నపోతా! నీకు తెలీకుండానే ఇదంతా జరిగిందా? మా అమ్మాయిని బలవంతంగా లాక్కెళ్ళి ఎక్కడో గుళ్ళో పెళ్ళి జేసుకున్నాడ్రా! నీ జాతేమిటి కులమేమిటి? నీ అంతస్తెక్కడ మా అంతస్తెక్కడ? మా అంట్లు తోమడానిక్కూడా పనికిరాని ముండా వెధవ. మా ఇళ్ళల్లో పాచిపోయిన చద్దెన్నం పందులకు వెయ్యటమెందుకని వీడికి పెడితే తిని పెరిగిన వెధవ—బ్రహ్మ ద్రోహం, జాతి ద్రోహం, వర్ణసంకరం తలపెడతాడా? వాడికి నీ వత్తాసు వుండే వుంటుంది. నూలుపోగులు వడుక్కుని అమ్ముకునే వెధవ్వి జంధ్యం వేసుకోగానే మాతో సమానమవుతావురా? అంట్ల వెధవా!" అని ఆ ముసలోడు ఒకటే ఎగురుడు మొదలు బెట్టిండు. నాకు కండ్లు బైర్లు గమ్మినయి. ఇప్పుడీ పెద్దలకు ఏంజెప్పాలె? నాకొడుకు ఇట్లజేస్తడనుకున్ననా?

నా బోధలు వానికెక్కకపోతె ఒక్కో జీవిది ఒక్కో తత్త్వం అని ఊకున్నగని ఇంతపని జరుగుతదనుకోలె" సాయన్న ఒక్క క్షణం ఆగాడు.

ముత్తడు నోరు తెరిచి వింటున్నవాడల్లా "మీకేగాదు నాగ్గూడనమ్మబుద్ధ యితలేదుంద్రి" అన్నాడు.

సాయన్న నవ్వి "మనం నమ్మనివి ఎన్నిజరుగుతలేవు ?" అని "ఇగ ఆ తర్వాత నా కొడుకును, ఆ ముసలోని బిడ్డను పిలిపించి వాల్లిద్దరిని ఎవలిండ్లకు వాల్లను తీసుకపోవాల్నని నిర్ణయించిన్రు పెద్దలు. నేను ఆలోచనలబడ్డ. వాల్లిద్దరు పెండ్లి జేస్కున్నారనబట్టిరి. ఇప్పుడు విడదీస్తె జరిగిన పెండ్లి అబద్ధమైద్దా?

అయ్యా! మీరు జెప్పేది నాకు బుర్రకెక్కలే. మా కాలోల్లందరికి నేనే పురోహితున్ని. అనేక పెండ్లిల్లు నేనే జరిపించిన, ఇప్పుడీ ఇద్దర్నీ విడదీస్తె ఈ పెండ్లి తంతు, మంత్రాలు వట్టియేనా? కట్టినతాలి తెంపుతె ఆడది విధవరాలు కాదా?" అనడిగిన. ముసలోడు మల్ల నామీదపడి నా అంగి చింపి నా కెవులు, జుట్టుపిండి–

"ఆ వెధవముండా శాస్త్రం మా కన్న నీకు ఎక్కువ తెలుసా? కోపం వచ్చి తంతే మాయావిడ తాళి ఎన్నిసార్లు తెగింది కాదు! బ్రాహ్మడి మంత్రాలతో కట్టిన తాళి తాళి అవుతుంది గాని ఏ గదిలోనో, గుడిలోనో తాళిగడితే దానికి విలవేమిట్రా?" అన్నాడు.

నాకు మళ్ళా ఒక ఆలోచన పచ్చింది. "అసలు వాళ్ళు తాళి కట్టుకోకనే పోతె?" అన్న.

"అసలు సమస్యేలేదు గదరా శూద్దర గాడిదా! ముందు వాళ్ళెక్కడున్నారో పిలిపించు" అని ముసలోడు మళ్ళా స్నానానికి పోయిండు.

నాదిక్కు అన్న వకీలు, తమ్ముడు వకీలు, మార్వాడీ వకీల్లు, షావుకార్లు అందరు జూస్తున్నరు. అందరికి నన్ను నరికి పారేద్దుమా అన్నంత కోపం ఉన్నట్టున్నది. నేను ఆలోచించిన. మనసు, మాట, చేతలతోని స్త్రీ పురుషులు ఏకమైతే వాళ్లు దంపతులని శాస్త్రం జెప్తున్నది. ఆ శాస్త్రం జెప్పిందని జెప్పె నోల్లుగూడ ఈ పెద్దమనుషులే. ఇప్పుడు ఇద్దరు దంపతులను విడదీసి ఎవ

రెండ్లకు వాళ్ళను పంపుమంటున్నారు, అంటే వాళ్ళిద్దరు ఏం జేసి వున్నా గూడ వీల్లకు ఫర్వలేదు. ఎవరింట్ల-ఎవరి స్థానంల వాళ్లు ఉండాలె, అప్పుడు వీళ్లు ధర్మాన్ని నిలబెడుతరు. ఆ ధర్మం హిందూధర్మం! నాకు పులుపరం బుట్టింది. ఇది హిందూ ధర్మమైతె దీన్ని ఆచరించుడెందుకు? లోపల ఎన్ని జేసినా మళ్ల పెద్దమనిష వేషాలువేస్తె చాలు!

ముసలోడు మళ్లా స్నానంజేసి విభూతి పూసుకోని వచ్చిండు. అప్పుడు నేను ఇట్లన్న.

"భగవద్గీతను ఇన్ని సంవత్సరాలనుండి సదువుతాననగని ఇప్పుడు తెలిసింది అర్థం. "చాతుర్వర్ణం మయాసృష్టం" అన్నది కృష్ణుని మాట. ఆయన గొల్లల తోటి తిరుగుతడు. అడవిజాతి గుడ్డేలుగు పిల్లను తాను పెండ్లి జేసుకుంటడు. రాక్షసజాతి పిల్లను తన మనుమరాల్ను జేసుకుంటడు. కని తన పట్టపురాణి రుక్మిణే కావాలె. తన చెల్లె మాత్రం అర్జునున్నే చేస్కోవాలె. అది ధర్మం! ఇప్పుడు మీరుగూడ నాకు జెప్పతాన్రు.

ఇందరు పెద్దలల్ల నగలతోటి ఊరొదిలిపోయిన బిడ్డను మల్ల ఏమెరుగనట్టు తెచ్చి గొప్పోనికిచ్చి పెండ్లి జేసినోల్లుండవచ్చు. వడ్డీల వ్యాపారంతోటి కొంపలు గూల్చినోల్లు వుండవచ్చు. చందాలు దిగమింగెటోల్లు వుండవచ్చు.

న్యాయవాదులమని అన్యాయాలు జేసెటోల్లు ఉండవచ్చు, కార్మిక నాయకులమని ఖూనీలు జేయించెటోల్లుండవచ్చు. మనోళ్ళకే మార్కులేసే యూనివర్సిటీ పంతుల్లుండవచ్చు. ఇందరు ఇన్ని తీర్ల హిందూధర్మాన్ని కాపాడుతాంటె దాన్ని జెడగొట్టుడు నా ఒక్కనితోని ఏమైతది? నాకొడుకు నాతోని చెప్పిచెయ్యలే. చెప్పతె ఏం జేద్దునో? అంత అయిపోయింది, ఇది నా చేతుల లేదు. ఇంక మీ ధర్మాన్ని మీరెట్ల నిలుపుకుంటరో మీ ఇష్టం" అని చేతులు జోడించిన.

ముసలోడు "ఒరే నిన్ను ఎన్ని తన్నినా సిగ్గులేదేంరా వెధవా! నేను ఎన్నిసార్లు స్నానం చెయ్యాలిరా?" అని ఒర్రిండు.

"ఇప్పుడు మీరన్న మాటలకు, చేతలకు నేను జవాబిస్తే ఎట్లుంటదో ఆలోచించుకోన్రి. కాని నేను జవాబియ్య. నా కొడుకుజేసిన పనికి, బాతసయితె

వాన్ని పట్టుకోని హిందూధర్మంల కలుపు(ని. వాన్ని అనలేక నన్నంటె నేనేం జేస్త?"

"నీ కొడుకు పెద్దకులం పిల్లనుజేస్కున్నదని నీగ్గూడ సంతోషమైవాడి కొమ్ము కాస్తున్నావు" తమ్ముడు వకీలు అన్నడు.

"నేనుముందే జెప్పిన. వాడునాతోని చెప్పిచెయ్యలేదని. అంటెవానికి గూడ నామీద నమ్మకంలేదు. యమ్మే జదివెటోళ్లు తెలివితక్కువ పనులుజేస్త రనుకోను" అని అన్న.

తమ్ముడు వకీలు అన్నడు. "బాగా ఆలోచించుకో! ఇది జాతి సమస్య" అన్న వకీలు అన్నడు. "ఆ అమ్మాయి ఇంటికి రాకపోతే మవు రేపట్నుంచి స్కూలుకు పెళ్లక్కరలేదు. నీ ఉద్యోగం నేటితోసరి!"

నేను తలవూపి బయటికొచ్చిన. ఇప్పటికి నాలుగు రోజులైంది. నా నౌకరీ పీకేసినట్టు ఇయ్యాల పొద్దున్నే కాయితం వచ్చింది" అన్నాడు రాయన్న.

ముత్తడు నిశ్చేష్టుడయాడు. హిందూధర్మం ఇంత గందరగోళంగా వుంటుందని వాడికి తెలీదు. అది ఉద్యోగాలనేకాదు ప్రాణాలనిగూడా తీస్తుం దని వాడికెవరన్నా చెప్పినా నమ్మి ఉండేవాడుకాదు.

  

అ.వ., త.వ. లిద్దరూ కోర్టు వరండా మెట్లు దిగి కారెక్కబోతుండగా కాస్త దూరంలో వాళ్లకు కులశేఖరరావు కన్పించాడు. అతడికంట పడొద్దను కుంటుండగానే ఆయన వీళ్లని చూడనే చూశాడు.

కులశేఖరరావు అవ తవలిద్దరికీ గురుతుల్యుడు. ఆయనంటే అన్నదమ్ము లిద్దరికీ పక్కబెదురు.

"ఒరే, మీ సిగలగొయ్య! అన్నట్టు మీకు సిగల్లేవు కాదూ, అప్రాచ్య లయారు. ఇప్పుడేమిటి ఎప్పుడో అయారు. మిమ్మల్ని కలుద్దామని నేనే అను కుంటున్నాన్రా. నానాటికీ ఇంత దంకనాకటానికి అలవాటు పడుతున్నారేమిటా అని అడగటానికీ!" అని కులశేఖరరావు ఆశీర్వచన పనస చదివి అన్నదమ్ము లిద్దరూ తేరుకోటానికి కాస్త టైమిచ్చాడు.

అవ తవ లిద్దరూ గింగరాలు తిరిగి తేరుకునేలోగా ఆయన మరో ప్రశ్న వేశాడు.

"ఒరే సదాహరరావూ! ఎప్పుడూ హరాయించుకునే ఉపాయాలేనా? సరే, ఏమిట్రా మీ ఏకాత్మతాయజ్ఞ కథ విశేషం?"

సదాహరరావు గొంతులో నములుతున్న తమలపాకు అడ్డంపడింది. "ఏదో మానవప్రయత్నం లెండి!" అన్నాడు ఇకిలిస్తూ.

"మానవ ప్రయత్నమేమిట్రా? మార్వాడీ ప్రయత్నం అను!" కులశేఖరరావు అన్నాడు.

"ఏమిటండీ మీ చమత్కారం?" అవ అన్నాడు.

"ఏమిటా నీ పిండాకూడు! ఒరే అపూర్వసహోదరుల్లారా! జడ్జీలూ అదీ కార్లూ మనాళ్లయితే నెగ్గుకొచ్చినట్టుకాదురా- మీకు డబ్బే ముఖ్యమైతే, పలుకుబడే ముఖ్యమయితే మీరుజెప్పే ధర్మోరక్షతి రక్షితః అనే మాటకి అర్థం ఏమిట్రా? శాస్త్రిలు చెప్పే ముండాకొడుకులు ఆచరించరేమిరా? మిమ్మల్ని చూసి జనం ఏం నేర్చుకుపోవాలని?" కులశేఖరరావు మాటకి అవ అడ్డు వచ్చాడు.

"ఏవండోయ్, నేను కాంగ్రెసు వాడిని నాకీమత విశ్వాసాల్లోకన్న ప్రజాస్వామ్యంలో నమ్మకం వుంది, అది గుర్తుంచుకోండి" అన్నాడు.

"అబద్ధాలు మాట్లాడేవంటే నీ పిండం మురిక్కాలవలో పెట్టిస్తా. నువ్వు కాంగ్రెసువాడివిట్రా? మరి ఈ మతవాద పార్టీవాడితో నీకు పనేమిటి? తమ్ముడు గనక అంటావా? పాలిటిక్సుకీ లైఫ్‌కీ తేడా వుందనా నీ అభిప్రాయం?" కులశేఖరరావు మాటలకి అవ గారి దవడలు దగ్గిరపడ్డాయి. ముఖం పక్కకి తిప్పుకున్నాడు.

కులశేఖరరావు తవ పైపు తిరిగాడు. "ఒరే నువు అజ్ఞానంలోవున్నావురా. నీకు జరుగుతున్న విషయాలు తెలీవు. పురాణాలు ఉపనిషత్తులూ వెదికి ధర్మసూత్రాలు నీ పత్రికలో బాక్సుకట్టి వేస్తే హిందూధర్మం నిలవదురా. ఒకటి చెప్పమంటావూ? అన్ని మతాలకన్నా ముందు నాశనమైపోయేది హిందూమతమే ఎందుకంటే దీన్లో వర్గీకరణలు ఎక్కువ. చాతుర్వర్ణాల్లో శూద్రజాతిని తీసుకో ఎన్నివున్నాయి దాన్లో రకాలు?- శూద్రులు, మళ్లీ సచ్ఛూద్రులు!! దాంట్లో మళ్లీ రకాలు. అంచేత హిందూమత వినాశం మానవులు వద్దన్నా మార్వాడీలు వద్దన్నా తప్పదు. ఏమిటి? అర్థమైందా!" అన్నాడు.

తవ నీళ్లు నములుతూ అటూఇటూ చూశాడు. కోర్టు వరండాలో లాయర్లూ జనం అటూఇటూ తిరుగుతున్నారు. ఎవడన్నా వింటాడేమోనని తవ భయ పడ్డాడు గానీ ఎవడికీ విన్పించనంత దూరంలోనే ఈ సంభాషణ సాగుతోంది; గడియారం చూసుకున్నాడు. ఐదు కావస్తోంది. కోర్టుమూసే వేళయింది.

"టైము లేదండీ; మళ్ళీ తీరిగ్గా కలుద్దాం." త.వ. అన్నాడు.

"నీకు టైమేమిట్రా? నాకు తెలీదూ నువు ఇంటికి వెళ్ళిచేసే పనేమిటో? ప్రాక్టీసు అట్టేలేదు గాబట్టి క్లయింట్లురారు. కాలేజీ కుర్రాళ్లొస్తారు. వాళ్ళకి రేపు ఫలానా కాలేజీలో ఈ గొడవ చెయ్యమనీ, ఫలానా గోడమీద ఈ రాత రాయమని చెప్పటం నీకోపని; ఆ వెధవముండా పనికన్న నాతో మాట్లాడితే నీకు వచ్చే నష్టంలేదుకాని నా ప్రశ్నలకి సమాధానం చెప్పి కదులు" కులశేఖర రావు కారు బానెట్ మీద తిష్టవేశాడు.

అవ తవ లిద్దరూ మొహాలు చూసుకున్నారు. ఎవడిమొహం చూశామో పొద్దున్నే అనుకున్నారు.

"మన జాతీయ ఆర్థిక వ్యవస్థ-అంటేఏమిటో అర్థమైందిరా బడుద్ధాయిలూ. నేషనల్ ఎకానమీ- ప్రస్తుతం మార్వాడీల చేతుల్లో వుంది. కాదని మీరుకాదు గదా మిమ్మల్ని సృష్టించిన మార్వాడీలుకూడా అనలేరు. కాబట్టి కల్చర్ కూడా వాడి అధీనంలో వుండాలి. అందుకే ఈ ఏకాత్మతా యజ్ఞాలు ఇవన్నీను ఏమంటారు?" అన్నాడు.

"శుద్ధతప్పు. మీదంతా వితండవాదం." అన్నాడు అ.వ. "నీకేమిట్రా ఈగోల? కాంగ్రెసు వాడివి. ప్రజాస్వామ్య విశ్వాసం గలవాడివి?" కులశేఖర రావు అన్నాడు. అవ తలఎగరేసి తమ్ముణ్ని చూశాడు. తమ్ముడు తమలపాకు ఉమ్మి గొంతు సవరించుకుని "అఖండ భారతంలో మార్వాడీలు, మనం వేరు కాదు. అందరం ఒకటే" అన్నాడు.

"అదే నేచెప్పబోయేది నీవిలా అనుకుంటున్నావు. కానీ మార్వాడీ అలా అనుకోడు. బొత్తరాహుడు బొత్తరాహుడే. వాడు నిన్ను తన మాయాజాలం కిందికి తీసుకుంటున్నాడు. నీవది గ్రహించలేకపోతున్నావు."

"అదెలాగ?" త.వ. అన్నాడు.

"ఎలాగంటే— ఉదాహరణ నీ నోటితోనే ఇద్దువుగాని! మొన్న దసరాకి మీ పరిషత్ వాళ్లంతా ఏంజేశార్రా?"

"ఏంచేస్తాం? ఏవో ఉత్సవాలు నిర్వహిస్తాం. అదే చేశాం" తవ అన్నాడు.

"అదే ఏమిటీ అని!"

"రామలీలా, కృష్ణ గోపికా నృత్యం ఇలాంటివి!"

"దసరాకి- మన దక్షిణ భారతంలోవున్న ఆచారం శమీపూజ. అంటే ఉత్తర గోగ్రహణం, భారతంలో పాండవులకి సంబంధించిన ఈ పండగని రామాయణంతో ముడిపెట్టడం ఏమిట్రా? ఢిల్లీలో జరిపే రామలీలని మన వూళ్లో జరపటం ఉత్తరాది సంస్కృతిని మనం నెత్తిన పెట్టుకోవటమా కాదా? పైగా నీ "బోధన" పత్రికలో శమీశమయతే పాపం- శమీశత్రు నాశనీ అని దసరా సంచికలో రాసేవుగూడానూ. రాతలకీ చేతలకీ కుదరదా?" కులశేఖరరావు ప్రశ్నకి అవ తవ లిద్దరూ నోరు వెళ్లబెట్టారు.

త.వ. ముందు తేరుకుని "మీరు భారతీయ సంస్కృతిని విభజిస్తున్నారు. అలా చూడటం తప్పు. విజయదశమి మన దేశానికి నిజమైన జాతీయ పర్వదినం సింహం పౌరుషానికీ, మహిషం మలిన తత్వానికీ, జడ స్వభావానికీ, భౌతిక శక్తికీ సంకేతం. ఈ రెంటి పోరాటంలో సర్వాయుధపాణియైన మాతృశక్తికి విజయం తప్పదు. భౌతికవాదం అణగక తప్పదు. విజయదశమి జాతీయశక్తి అంకురానికి శక్తిని సమకూర్చేదిగా మన నాశీర్వదించాలి, జడత్వ రూఢిమత్వ సీమలను ఉల్లంఘించి అంతశ్చేతనను గుర్తించిన నాడే అది సాధ్యం, అదే సీమోల్లంఘనం" అన్నాడు.

"బాగుందిరా వరస! అబద్ధంవా సుబద్ధంవా ఏదో ఒకటి వాగటం దాన్లో నాలుగు సంస్కృత పదాలు ఇరికించటం! ఇది నీ సంఘ సమావేశాల్లో బాగుంటుందిగాని తెలిసిన వారి దగ్గరకాదు. భౌతిక శక్తిని లొంగతీయటం ఏ అభౌతిక శక్తికీ సాధ్యంకాదు. అది నీకు తెల్సు. అందుకే మీరు కమ్యూని‌స్టుల్ని మీ వేదాంతంతోనో, తత్వంతోనో గాకుండా భౌతికశక్తితోనే ఎదుర్కొంటారు, చెప్పేదేమో అంతశ్చైతన్యమూ, జాతీయ ప్రేరణా! మహిషాన్ని

జయించే సింహానిదిగూడా భౌతికశక్తే అని మీరు బయటికి ఒప్పుకోరా?" కుల శేఖరరావు ప్రశ్నకి తవ చిరునవ్వునవ్వి లాల్చీ జేబులోంచి ఒక పొట్లం తీసి దాన్లోవున్న తమలపాకు దవడకి కుక్కుకున్నాడు. తర్వాత ఇలా అన్నాడు.

"మనదేశం అగ్నిగర్భ. నేడు అనైక్యతతో, పరదేశ దాస్యభారంతో స్వార్థంతో నివురుగప్పినట్లున్నది. ఆఅగ్ని గర్భను పూజించవలె. వెలువరించు కోవలె. అదే శమీపూజ."

"ఇంకో పది నిముషాలు ఇలాగే మాట్లాడితే నాకు పిచ్చెత్తదంభాయం. నా ప్రశ్న నీకు అర్థం కావడంలేదా లేక నీ హిందూధర్మ వెర్రి నిన్నువదల టం లేదా? నేనడిగేదేమిటి నీజవాబేమిటి? సరే నీ దోవకి నేనే వస్తాను. ఇందా కేమిటి శమీపూజ అన్నావు కాదూ! విజయదశమి శమీపూజ అయితే మరి రామ లీల జరపడం ఏమిట్రా?" అన్నాడు కులశేఖరరావు.

"బాధ్యతను స్వీకరించే సాహసం కావాలి. సమష్టితత్వం కావాలి. మనదీ సమాజం అన్న దృష్టి రావాలి. ఈ దేశపు సాంస్కృతికైక్యత సాధి స్తున్న మాధ్యమాలు పండుగలు. ఆదాన ప్రదానాలుగా మనం వాటిని స్వీకరిం చాలి. స్ఫూర్తిసోర్తిస్విసులైన పర్వదినాలలో జరిగే కార్యక్రమాలలో విపరీతం కన్పిస్తే శాస్త్రీయ విమర్శ చేయవచ్చు." అన్నాడు తవ. అతడి నోట్లో తమల పాకు లాలాజలం నిండటంతో పక్కకి వెళ్ళి ఉమ్మి మళ్ళీవచ్చి,

"భారతీయమైన అనగా హైందవమైన స్వధర్మభావానికి శమీపూజ ఐతే నేం? రామలీల అయితేనేం?" అన్నాడు,

"ఐతే శమీపూజే జరపవచ్చుగదా! పైగా నాకు తెలిసి దసరానాడు శమీ పూజ జరుపుతారు గాని రామలీల జరపరు. ఇప్పుడు మీ పుణ్యమా అని ఇదొకటి దాపురించింది." అన్నాడు కులశేఖరరావు.

"దాన్నే ఏకాత్మత అంటారు. రామలీలని జనం వ్యతిరేకించలేదుగదా! అంటే దాన్ని వారు స్వీకరించినట్టేగదా?" అన్నాడు తవ.

అవ గారికి సందుదొరికింది. "మా ఇందిరమ్మ చెప్పే నేషనల్ ఇంటి గ్రేషన్ కూడా ఇదే" అన్నాడు.

"నాకు తెలీదట్రా? వీడు ఏకాత్మత అంటున్నాడు—నువు నేషనల్ ఇంటి గ్రేషన్ అంటున్నావు. హరికథలకి వచ్చే వాళ్ళంతా శ్రద్ధాసక్తులతో రారని మీకు తెలిసేవుండాలే." అన్నాడు కులశేఖరరావు.

"ఏమిటండీ మీతర్కం? బట్టతలకీ మోకాలికీ ముడిపెడుతున్నారు?" అవ అన్నాడు.

"ఆ పని నాదికాదు మీదే! బ్రిటిషువాడికి వస్తువులమ్ముకోటానికి చోటు చాలక వలసల్నిస్థాపించి ఎక్కడెక్కడి ప్రాంతాల్నీ ఏకం చేసి అక్కడ తన మార్కెట్లని స్థాపించాడు. అలాగే ఇండియాని గూడా జయించి ఏకం చేశాడు. తన మార్కెట్టును వృద్ధిచేసే క్రమంలో వాడాపని చేస్తే దాన్ని పట్టుకుని మీ రివాళ అఖండ భారత్ అంటున్నారు. మీది సామ్రాజ్యవాద సేవకసంఘం! మొత్తానికి మీకూ అంతర్జాతీయ ఉందిరోయ్! మరి జాతీయవాదులమంటారే మిత్రా?" కులశేఖరరావు నవ్వాడు.

"మీరు మమ్మల్ని పక్కదారి పట్టిస్తున్నారు. మా పాయింటు మీదనిలిచి మాట్లాడటం లేదు." అన్నాడు తవ.

"పక్కదారి పట్టించేది నేనుకాదు మీరే. వాదనే కాదు జనాన్నే పక్కదారి పట్టిస్తున్నారు. షావుకారు సరుకు అమ్మటం కోసం తన ఏజెంటుని పెడతాడు. సామ్రాజ్యవాదానికి అలాంటి ఏజంట్లు మీరు. టినోపాల్ కంపెనీవాడు డిటర్జెంట్ల యుగం వచ్చాక వెనకపడిపోయాడు. అప్పుడు వాడు రానిపాల్ అనే కొత్త లేబిల్‌తో సరుకుని అమ్మాడు. అలాగే సామ్రాజ్యవాదం నిన్నటిదాకా నేషనల్ ఇంటిగ్రేషన్ అనేనినాదాన్ని ఇందిరతో ఇప్పించింది. ఇందిరమీదజనానికిమోజు తగ్గేసరికి మిమ్మల్ని పట్టుకున్నది. దాన్నే కాస్తమార్చి ఏకాత్మత అని మీనోటితో అనిపిస్తోంది. జనానికిదంతా ఏం తెల్సు? మీలాంటి పెద్దమనుషులేంచెపితే అది వింటారు. మర్చిపోతారు అంతే. కాకపోతే కొంతకాలం వారి మీద ప్రభావం వుంటుంది." కులశేఖరరావు అన్నాడు.

తవ తలెగరేశాడు. "చాల్లెండి మీవాదం! మా ప్రోగ్రాములకు రెగ్యులర్‌గా అటెండయే ఒకాయన ఐదువేలు విరాళం ఇచ్చాడు. ఇంకా ఎంతో మంది ఇచ్చారు. ఎంత ప్రభావితం కానిదే అలా ఇస్తారు?" అన్నాడు.

"ఆ ఇచ్చినవాడు వ్యాపారస్తుడు అయివుంటాడు. లేదా పోలీసాఫీసరో, లంచగొండి అధికారో అయుంటాడు తప్ప సగటు మనిషి అయుండడు. కమ్యూనిస్టుల మీటింగులు విని భూస్వాముల భూములు ఆక్రమించుకున్నవాళ్ళని నేను

చూపిస్తాను. నీహరికథలు, ధర్మబోధలు విని సద్వర్తనులైన వాళ్ళని నువెందర్ని-కనీసం ఒకణ్ని చూపుతావా?"

"ఒకడో ఇద్దరో జాతికి సంఘానికి ప్రతినిధులుకాదు. మొత్తం జాతీయ స్వభావాన్నిబట్టి జాతి స్వభావాన్ని అంచనావేయాలి" అన్నాడు తవ.

కులశేఖరరావునవ్వి "నువు చెప్పింది విని తలూపడానికి నేను జడ్జీనికాదు. ఇప్పుడునువ్వే ఉన్నావు. ఒక్కణ్ని ఉదాహరణ చూపమన్నప్పుడు నిన్ను నువ్వే చూపుకోవచ్చు. కానీ నీకాస్ఫూహేలేదు. ఎందుకంటే ఏ ధర్మాన్ని నువు బోధిస్తున్నావో ఆ ధర్మం కొనసాగటానికి వీల్లేని, అవకాశంలేని సంఘంలో నువూ అలాగే బతుకుతున్నావు గాబట్టి! దాన్ని కప్పిపుచ్చుకోటానికి జాతీ, జాతీయ స్వరూపం అని పెద్దమాటలు వాడటం దండగ!" అన్నాడు.

"కమ్యూనిస్టులవాదనలు మనిషిఉద్రేకాన్ని రెచ్చగొడతాయి.మాబోధనలు మనిషిలో ధర్మాన్ని పాదుకొల్పుతాయి. వాళ్ళదిపొంగుకాబట్టి త్వరగా తెలుస్తుంది. మా ధర్మ వృక్షం పెరిగేసరికి ఆలస్యమవుతుంది. అదీ తేడా!"

"నువు పొరబడుతున్నావు. కమ్యూనిస్టులవాదనలు భౌతిక జీవితానికీ, సమస్యలకీ సంబంధించినవి. కనుక మనిషి వెంటనే స్పందిస్తాడు. మీది అలౌకిక విషయబోధన కాబట్టి నిర్లిప్తులవుతారు".

"మీకు సంస్కృతి మీద తేలిక అభిప్రాయమున్నది" అన్నాడు తవ

"ఏడిశావు. సంస్కృతి పట్ల నీకన్న నేనే పిడివాదిని. సంస్కృతి అంటున్నావు ఏదిరా నీ సంస్కృతి?"

"సంస్కృతీ నిర్వచనం కష్టం. మన సంస్కృతి వేదపురాణాల్లో, రామాయణ భారతాల్లో వుంది. అది మన సంస్కృతి. జాతీయత జీవన స్రోతస్సు. అది జీవన విధానం. దాన్ని మీకు అర్థమయేలా చెప్పటం కష్టం." తవ అన్నాడు.

"మరి నాకర్థమయేలా చెప్పటమే కష్టమైతే ఏమీ తెలీని వాడికి ఎలా చెబుతావురా? వాడి అజ్ఞానం మీద ఆడుకుంటావా?" కుల శేఖరరావు అన్నాడు.

"నేను హిందువును. ధర్మగంగ బిందువును. అలాంటి పనులు నాకు రావు" తవ అన్నాడు.

"ఏడిశావు నువు దాక్షిణాత్యుడివి. ఔత్తరాహుల ప్రాబల్యం వున్న సంస్థలో వున్నావు. భారతదేశంలో ఎక్కడైనాసరే ఆ సంస్థాధిపత్యం అక్కడ

సెటిలై వున్న ఔత్తరాహుల చేతిలో వుంటే వాడికింద గులాం గిరీ చెయ్యటానికి నీ సంస్కృతి ఏమైపోయింది? ఆదిశంకరుల తర్వాత మళ్ళీ ఇదే మత యాత్ర అని ఏకాత్మతా రథయాత్రని పొగుడుతున్నారే, పన్నెండువందల ఏళ్ళ కింద శంకరుల దాక్షిణాత్యతత్వం ఔత్తరాహుల్ని గూడా ప్రభావితం చేస్తే ఇవాళ ప్రతీకారమా అన్నట్టు ఉత్తరాది నుంచి ఏకాత్మతా యజ్ఞం ప్రారంభమై హరిద్వారం రామేశ్వరాన్నీ. గంగ కావేరినీ జయించడానికి బయలుదేరింది. ఏమిట్రా గంగకున్న గొప్పదనం? ఆగొప్పదనం గోదావరికీ, కృష్ణకీ, కావేరికీ లేదా? రష్యానీ, చైనానీ, తప్పనప్పుడు అమెరికానీ విదేశీ సంస్కృతి అని విమర్శిస్తావే! నీ మీదే పరాయిసంస్కృతి, నిన్నటిదాకా నీదికాని ఉత్తరాది సంస్కృతి రుద్దబడుతుంటే దాన్ని విమర్శించవా? సంస్కృతిని భారతాన్ని బట్టీ రామాయణాన్ని బట్టీ కొలవగూడదురా! ప్రాంతాన్ని బట్టి కొలవాలి. జీవన విధానం సంస్కృతి కాని పుస్తకాలు కాదు. అధికారం కోసం, డబ్బు కోసం పలుకుబడికోసం పరాయి సంస్కృతికి అక్షరాలా దాస్యంచేస్తున్ననీకుసంస్కృతి గూర్చీ మతం గూర్చీ మాట్లాడే అర్హతలేదు. ఇదంతా రాబోయే ఎలక్షన్లలో మీ పార్టీని గద్దెనెక్కించే పన్నాగం" కులశేఖరరావు తవని చూస్తూ అన్నాడు. అవగారు బాదాంచెట్టు ఆకుల్ని లెక్కిస్తున్నాడు. నూటఎనభై ఆరులో వున్నాడతను. కులశేఖరరావు అరుపులకి లెక్క మరచిపోయి మళ్ళీమళ్ళీ లెక్కతప్పుతున్నాడు.

"మీకు అర్థమయేలా చెప్పటం ఎలాగో నాకసలు అర్థంకావటంలేదు. మేం హిందూధర్మ ప్రతిష్ఠాపనకోసం ఈ పని చేస్తున్నాం తప్ప స్వార్థం మాకే కోశానా లేదు" తవ అన్నాడు.

"ఓహో అదా సంగతి! ఐతే రెండుకోట్ల నిధిసేకరణా, ఈహుండీలూ హంగామా ఎందుకురా? ధర్మానికి అర్థంతో పనేమిటి? అర్థబలంతో నిలిచే ధర్మానికి అర్థమూ విలువావుంటాయా? ఈ పేరుతో ఎలక్షన్ ఫండూ, జనాన్ని సమకూర్చుకోవటం రెండూ జరగాలని మీ వుద్దేశంకాదూ! మతం రాజ్యానికి సేవ చేస్తుందని ఎంత చక్కగా నిరూపిస్తున్నార్రా?" కులశేఖరరావు నవ్వాడు.

తవ ముఖం ముటముటలాడించాడు. "డబ్బుని కూర్చుకోవాల్సిన అవసరం మాకేంలేదు. ఉదయపూర్ రాజా, గ్వాలియర్ రాణీ ఉన్నసంఘం మాది!" అన్నాడు. అని నాలిక్కరుచుకున్నాడు.

"అదీ సంగతి! కమ్యూనిస్టులకీ ఒక వర్గం అంటూ ఉన్నది చెప్పుకో డానికి. మీకున్నదంతా వర్ణాలే. మీరు వర్గం అనుకునేది చరిత్ర నుంచి తొలగి పోతున్న వర్ణం. దానికి రాజ్యాన్ని నడపగల శక్తిలేదు. పుచ్చిపోయిన తాడుని పట్టుకుని కొండ ఎక్కబోతున్నారు మీరు" అన్నాడు కులశేఖరరావు.

తవలోని భారతీయత వేయిపడగలెత్తి బుసకొట్టింది.

"మీరు అఖండ భారతీయ సాంస్కృతిక స్రవంతిని ప్రాంతీయ తత్వంతో ఖండఖండాలుగా తుండతుండాలుగా ముక్కలుగా చెక్కలుగా పీసెస్ అండ్ ఐటమ్ వైజ్‌గా డివైడ్ చేసి-విభజించి మాట్లాడుతున్నారు. వాట్ సెడ్ ఇన్ ఏన్షియంట్ లిటరేచర్? జంబూద్వీపే, భరతఖండే-వాటీజ్ ఇట్? భారత ఈజ్ అఖండ భారత్! అండ్ ఏన్ అన్ డివైడెడ్ గ్రేట్ లాండ్ విచ్ ఈజ్ ఎ కాంప్లెక్స్ ఆఫ్ మెనీ కల్చర్స్ - వోహై అఖండ భారత్!" తవ గర్జించాడు.

కులశేఖరరావు కారు బానెట్ మించి దిగాడు. తాపీగా అన్నాడు. "తల్లి గురించి మేనమామ దగ్గర మాట్లాడకు. వెంటనే ఇంటికి పోయి శ్రీకారం నుంచి మళ్ళీ చదువుకో. చదువుకుని ఆతర్వాత అందరితో మాట్లాడు. నీ బోర్డూ, నల్లకోటూ తీసెయ్యి. జ్ఞానంకోసం చదువుకో. అన్నీనాకు ముందే తెలుసనే అహంకారంతో చదవకు." అని రెండడుగులువేసి ఆగి మళ్ళీఅన్నాడు. "ఇలా ఎక్కడా వాగకు. తోళ్లు వలుస్తారు" అని వెళ్ళిపోయాడు.

తవ చిన్నబుచ్చుకుని అవ వైపు చూశాడు. అతను బాదాం ఆకుల్ని లెక్కపెట్టి చేతిలోవున్న ఫైలుమీద రెండొందల నలభయ్యారు అని రాశాడు. మళ్ళీపక్కనేవున్న గోరింట చెట్టుని పట్టుకుని లెక్క మొదలెట్టాడు. దూరంగా ఉన్న కొత్త వకీళ్లు అవగారి తరహా చూసి అతనేదో లాపాయింట్ల గూర్చి దీర్ఘంగా ఆలోచించి అవిరాసుకుంటున్నాడేమో అని ఒకరితో ఒకరు చెప్పు కున్నారు.

తవ పక్కకి చూసేసరికి కమ్యూనిస్టు వకీలు పక్కనున్నవాడితో "అందుకే మేం శాంస్క్రిట్ సమాఖ్య అని ఒకటి పెట్టామండీ. అది ఇలాంటి వెధవ రథ యాత్రలు ఇవన్నీ పట్టించుకోదు. ఏమిటంటే ముండాకొడుకులు మరీఇంత మధ్యయుగం మనస్తత్వంగాళ్లా!" అంటూ కదిలి వెళ్ళిపోయాడు.

"ఇక వెళదామా ?" తన అనతో అన్నాడు. "తొంభయిఆరు. తొంభయి...."ఆగిపోయాడు. అన పక్కకి చూసి "వెళ్ళాడా ఆ మహానుభావుడు?" అన్నాడు.

"మైత్తానికి వదిలాడు"

అన తన లిద్దరూ కారెక్కారు.

"పద్దెనిమిది వందల ముప్ఫయి" అన్నాడు అన కారుస్టార్టు చేస్తూ.

"ఏమిటి?" తన అడిగాడు.

"ఆకులు !" అన చెప్పాడు.

"బాదాం రెండొందల నలభయ్యారు....గోరింట...." అన చెబుతూంటే తన తలకాయ పట్టుకున్నాడు.

విశాలమైదానంలో రెండు రథాలు వచ్చి ఆగివున్నాయి. వేలాది మంది జనం. పరిషత్ కార్యకర్తలు కర్రలు పుచ్చుకుని జనాన్ని అదుపుచేస్తున్నారు. వచ్చిన వాళ్లలో స్త్రీలెక్కువ. నిన్నటిదాకా వేదికని నిర్మించిన ముత్తడు ఇప్పుడు వేదికకు ఫర్లాంగు దూరంలో వున్నాడు. కారణంవాడికే తెలియటంలేదు.

ముందు వేదిక దగ్గరికి అయ్యగార్లు వచ్చారు. ముత్తడు పదిగజాల దూరంలో నిలుచున్నాడు. తర్వాత నగర పెద్దలు వచ్చారు. దాంతో వాడికి వంద గజాలు దూరం వెళ్లక తప్పిందికాదు. క్రమక్రమంగా పరిషత్ కార్యకర్తలు రావటం జనాన్ని అదిలించటం ప్రారంభించాక వాడికి అక్కడ వుండటం సాధ్యంకాలేదు. కానీ ఇంటిముందుకి వస్తున్న గంగాజల సేవనం కోసం వాడు తహ తహ లాడుతూ అక్కడేవున్నాడు. ఫలితంగా వాడికి రెండుమూడు దెబ్బలుకూడా పడ్డాయి.

రథాలు నాలుగింటికి వస్తాయన్నారు, ఆరయింది ఎనిమిదయింది. పదయింది. ఇంకారాలేదు. వెళదామంటే అవేం మామూలు రథాలా? గంగాజల రథాలు! అవి తాగనిదే, తరించనిదే, కదిలేదెలా? క్రమంగా జనం ఎక్కువవపు తున్నారు. అందరూ గంగాజలం కోసమే, భారతమాత దర్శనంకోసమే! ఆలస్యం అవుతోంది. ఆలస్యమవుతున్నకొద్దీ జనం పక్కనేవున్న సినిమా హాళ్లలోనూ, బార్ లలోనూ, దూరారు. గంగాజలంతో సమానమైన మధుజలాన్ని సేవించటానికి!

ఇంతమందికీ అంత గంగాజలంఎక్కడి నుంచి పోస్తారు? ముత్తడను కున్నాడు. కార్యకర్తలు ఇరవై గజాలలో బిందెపెట్టి దాంట్లో నీళ్లు నింపుతున్నారు. పిల్లలు అక్కడ రాసి వున్నమాటల్ని "ఏకతాతాయజ్ఞం" అని వేళాకోళం పట్టిస్తున్నారు.

ఇంతలో ఒక కార్యకర్త ముత్తణ్ని పిల్చాడు. "ఇంత దూరంగా ఉన్న వేందిరా? ఇటురా!"

ముత్తడు వెళ్ళాడు. ఒకబక్కెటూ,తాడూ వాడిచేతికిచ్చి "అబాయిలనీల్లు తోడి ఇయ్యిపో. వీల్లు మోస్తరు" అన్నాడు.

ముత్తడు బకెట్టు అందుకొని పరిగెత్తాడు. వాడి వెనకే బిందెలు పట్టుకొని పదిమంది దాకా ఉరికారు. వాళ్ళంతా ఎన్ని బిందెలు మోశారో, ముత్తడు ఎన్నినీళ్లు తోడాడో తెలీదు. రాత్రి పదకొండు కావస్తూండగా రథాలు వచ్చాయి. ముత్తడు దూరంనించి వాటినిచూసి ఉద్వేగపడిపో ఉ ఆ ఉద్వేగంతో నీళ్లని అవలీలగా తోడేశాడు, ఎన్ని తోడినా చాలునని అనరు. మోసే వాళ్లు ఇంకా వస్తున్నారు. ఒకణ్ని అడిగాడు.

"ఇంక సాలయా?"

"ఏమో! డ్రమ్ములు అన్ని నిండాలన్నారు." వాడు చెప్పాడు. రథాలు రాకపోవటంతో కోలాహలం మొదలైంది. జనంగోలగా అరుస్తున్నారు. కార్యకర్తల-కర్రలు పైకిలేచి కిందికి పడుతున్నాయి. అంతటా కాషాయరంగు జెండాలు, ఓంకార నాదాలు, నినాదాలు మారుమోగుతున్నాయి, హిందూధర్మ స్వరూపం ఒక్కచోటనే గుమిగూడి నట్టయింది.

బావి అంచుమీద ముత్తడు ఎక్కి రథాల్ని చూశాడు. గంగాజల కలశ రథం ఇత్తడిరంగులో మెరిసి పోతోంది. దానిమీదబంతిపూల దండలు,కాషాయ జెండాలు వెలిగిపోతున్నాయి. ముత్తడు అలౌకికానందంలో మునిగిపోయాడు. చేతులు జోడించి రథాలకే నమస్కరించాడు. భుజంమీద ఎవరిదో చెయ్యి పడింది. కళ్లు తెరిచాడు.

"నీళ్లు చేదుతానవా?" శాయన్న అడిగాడు.

"ఆఁ ఎందుకోమరి చేదుమన్నరు" ముత్తడు రథాలనుంచి చూపుమరల్చకుండానే అన్నాడు.

"కొద్దిగాగు, అదే తెలుస్తది." శాయన్న అన్నాడు.

ఇంతలో జనంలో కోలాహలం చెలరేగింది. గంగాతీర్థం అందరికీ పంచుతున్నారని అర్థమైంది ముత్తడికి. ఎన్నో రోజుల్నించి ఎదురుచూస్తున్న క్షణం వచ్చింది. గంగాజలం సేవించి తానూ పునీతుడవాలి. భుజంమీద వున్న శాయన్న చేతిని తొలగించి రథంవైపుపరిగెత్తాడు.

అంతాజనం, విపరీతమైన జనం. గంగాజలం ఎవరికి చేదు? విష్ణువు పాదాల నుండి, శివుని శిరస్సు నుండి, భూమినీ, పాతాళాన్నీ పునీతం చేస్తూ ప్రవహించే గంగ, సర్వపాపహారిణి కావాలని వస్తే వద్దనేవాడెవడు!

జనం తోపిడి ఎక్కువైంది. ముత్తడు ముందుకు వెళ్ళలేకపోతున్నాడు. క్రమంగా వెనక్కు-వెనక్కు వెళ్ళి ఫర్లాంగుదూరంలో నిలబడిపోయాడు. జనం తగ్గేసూచనలేదు. రథాలు వచ్చి గంటసేపయింది. ఎవరెవరో ఉపన్యాసాలు దంచుతున్నారు. కార్యకర్తలు జనాన్ని తోస్తున్నారు.

ముత్తడు అంతా పరిశీలించాడు. తోసుకువెళ్ళేవారికి గంగాజలం లభిస్తోంది. దాన్ని ప్లాస్టిక్ సంచీల్లో నింపితెచ్చి బయట తనలాగే వెళ్ళలేనివాళ్ళకి అమ్ముతున్నారు. చివరికి గంగాజలం కూడా అమ్ముతున్నారనుకున్నాడు. ఇలాగే నిలబడితే తనకి ఆనీరు దొరకదు. కొనుక్కునే శక్తిలేదు. భుజబలం తప్ప నతకి ఏదీలేదు.

నడుంకున్న గోచీ కట్టుని గట్టిగా బిగించుకున్నాడు ముత్తడు. తలమీది రుమాలు తీసి గట్టిగా చుట్టుకున్నాడు. దూకుడుగా జనంలోకి దూసుకుపోయాడు. అంతా కీకారణ్యంలాంటి జనారణ్యం. తోసుకుని, పడేస్తు, పడుతూ లేస్తూ వెడుతున్నాడు. గోల! ఎవరో గుద్దారు. ఇంకెవరో తన్నారు, ఎందరోతిట్టారు. ఐనా లెక్కచెయ్యక గంగాజలం పంచేచోటికి వెళ్ళాడు ముత్తడు. అక్కడ కాస్త తెరిపిదొరికింది. ఇప్పుడు తాను జనంమధ్య ఉన్నాడు. కార్యకర్తలు లైనుగా అందర్నీ నిలబెట్టిస్తున్నారు.

ఆ లైనులో నిలబడి సర్దుకున్నాడు ముత్తడు. తలరుమాలు ఎక్కడో ఊడిపోయింది. గంగాజలం తాగనిదే వాడి తపన తీరేట్టులేదు. ఎన్ని రోజుల్నించి ఈ క్షణంకోసం ఎదురుచూశాడు! ఇది తప్పిపోతే? రథాలు ఎక్కువసేపు వుండవట! త్వరగా గంగాజలం సంపాదించాలి. జన్మ పునీతమవుతుంది.

ఆలోచనలో గంటగడిచిన సంగతి వాడికి తెలియలేదు. అక్కడో బల్ల మీద ఇత్తడి గంగాళం వుంది. దాంట్లోనించి రాగిపాత్రతో గంగాజలంపోస్తు న్నాడో కార్యకర్త. దోసిలిపట్టి తాగుతున్నారు జనం. వెంటతెచ్చుకున్న పాత్ర ల్లోనూ, సీసాల్లోనూ, ప్లాస్టిక్ సంచీల్లోనూ నింపుకుంటున్నారు.

"తల్లీ గంగమ్మతల్లీ! ఇన్నాళ్ళకు నా దగ్గరికి వచ్చావా?" ఎవడో పార వశ్యంతో అంటున్నాడు.

ముత్తడు పులకించాడు. ఇంక ఐదారుగురి తర్వాత తనదే వంతు! వెంట ఏదన్నా పాత్ర తెచ్చుకోనందుకు విచారించాడు. ఇత్తడి గంగాళం మెరిసి పోతోంది. రాగిపాత్రలోంచి నీరు ధారగాపారి జీవుల్ని పావనంచేస్తోంది.

ముత్తడి కనుబొమలు అంతలోనే ముడిబడ్డాయి. అవతల చీకట్లోవున్న డ్రమ్ముల్లోని నీరు తన గూడెంవాళ్ళు ముంచి ఒక బండరాయి మీద పెడితే అది తీసుకుని బ్రాహ్మడొకడు గంగాళంలో అయిపోతున్నకొద్దీ నింపుతున్నాడు. అవి తానిందాకా తోడిన నీళ్ళే! ఆ నీటినే రాగిచెంబుతో పోస్తున్నాడు మరొకడు. తడిక అడ్డంగా వున్నందువల్ల సరిగా కన్పించటంలేదు. ముత్తడు లైనులోంచి బయటికి వచ్చి ఆ వైపు నడిచాడు. అక్కడి కార్యకర్తలు అడ్డబోయారుగాని ముత్తడు వారికి తెలిసినవాడు కావటంతో వదిలారు.

"అయ్యా! ఈ డ్రమ్ముల నీల్లు గిట్లుపోస్తున్నరేంది?" ఒక అయ్యగార్ని అడిగాడు.

అయ్యవారు ఉలిక్కిపడి "నీకెందుకురా ఇదంతా? పో!" అన్నాడు. ఇంతలో ఇద్దరు కార్యకర్తలు వచ్చారు. "ఏండిరా? ఏంగావాలె!" అన్నారు.

"బాయినీల్లను గంగనీల్లని జెప్పి పోస్తాన్రు, పాపంగాదా? ముత్తడడి గాడు.

"పాపంలేదు ఏం లేదుగని ముందుగాల నువ్వు అవతెనక్కబో" కార్య కర్తలు మందలించారు. ముత్తడి జబ్బపట్టి వెనక్కితోశారు. వాడు కాస్త తూలి నిలదొక్కుకుని గంగాళం ఉన్న బల్లవైపు ఉరికి అడెక్కాడు. చెంబుతో నీళ్ళు పోస్తున్న అయ్యగారు నివ్వెరపోయాడు. "ఆగన్రి, ఇది గంగనీరు కాదు. మున్సిపాల్టి బాయినీల్లు. నేనే చేదిపోసిన అసలు గంగ ఆ రథంల ఉన్నదిరాన్రి" అని బల్లదూకి రథంవైపు పరిగెత్తాడు.

కార్యకర్తలు ముత్తణ్ణి వెంబడించి ఆపారు. వాడు ఆగలేదు. "గంగ పేరుతో మోసం చెయ్యకున్రి. నాకు అసలు గంగ నీరు కావాలె" ఎక్కడలేని బలంతో కార్యకర్తల్ని విదిలించుకున్నాడు.

జనంలో గోల బయల్దేరింది, రథం దగ్గిర ఉన్న పెద్దలకి విషయం అంతా చేరింది. ఇంతలో ముత్తడు రథం దగ్గరికి చేరాడు. కానీ ఆ జలాన్ని ఎలా సంపాదించాలో వాడికి అర్థంకాలేదు. ఒక ట్రక్కు మీద ఇద్దరు మనుషుల నిలుపునా వుంది కలశం. దానిలోవుంది గంగాజలం.

రథంమీది ఉత్తరాది మనుషులంతా గోలగా అరిచారు. అక్కడ తెలుగు తెలిసిన వాడెవడు లేకపోవటంతో ముత్తడి మాటలు ఎవరికీ అర్థం కావటంలేదు. కానీ వాడేదో చేయాలని వచ్చాడని అందరికీ అర్థమైంది.

రథంమీది పూజార్లు హిందీలో ఏదో అంటూ ఇత్తడి బెత్తాలతో ముత్తణ్ని కొట్టారు. ముత్తడు రథంచుట్టూ మేక బోనుచుట్టూ తిరిగే పులిలా ఒగరుస్తూ తిరుగుతున్నాడు. వాడిమీద ఇత్తడి బెత్తాలూ, వెదరు కర్రలూ తమ ప్రతాపాన్ని చూపిస్తున్నాయి.

కార్యకర్తలు కొందరికి కర్రలు లేకపోతే హిందూధర్మ జెండాలు పాతిన కర్రపీకి వాణ్ని కొట్టారు. హిందూధర్మ ఓంకారపుజెండా మాల ముత్తడి రక్తంతోతడిసి అతుక్కు పోయింది. ముత్తడు రెండునిమిషాలసేపు రథంచుట్టు గంగాజలం కోసం తిరిగి ఆఖరి ప్రయత్నంగా రథం ఎక్కటానికి ట్రక్కుమీద కాలు మోపాడు.

మాలవాడి స్పర్శతో గంగాజల భాండం అస్పృశ్యం కాకముందే వెదురు కర్రలు వాడినెత్తిన హిందూ ధర్మాన్ని మోపాయి. కళ్లలో మూడునక్షత్రాలు మెరిసి అడ్డంపడిపోయాడు ముత్తడు. స్పృహ తప్పినవాడి శరీరాన్ని చీకట్లోకి ఈడ్చారు కార్యకర్తలు.

ఆ గొడవకి జనంలో తొక్కిసలాట మెదలైంది. ఏం జరుగుతున్నదో చూడాలని అందరూ తోసుకుంటున్నారు. కేకలూ గోలా ఎక్కువయాయి. స్త్రీలూ పిల్లలు భయంతో అరుస్తున్నారు. ఒకర్నొకరు పట్టించుకునేస్థితి లేకుండా పోయింది. కార్యకర్తలకి జనాన్ని అదుపుచేయటం సాధ్యం కావటంలేదు. వెదురు కర్రలకి కట్టివున్న ట్యూబ్ లైట్లు ఆ సందడిలో ఆరిపోయాయి. ఆ వాతావరణానికి చీకటి గూడా తోడయేసరికి ఆ ప్రదేశం అంతా గంద్రగోళంగా తయారయింది.

"నిశ్శబ్దం. నిశ్శబ్దం. ఏమీలేదు, భయపడకండి. ఎక్కడివాళ్లక్కడే వుండండి" మైకులో ఎవరో అరుస్తున్నారు.

"సావధాన్-సావధాన్ కార్యకర్తలు హెచ్చరిస్తున్నారు. రథంచుట్టూ వల యాకారంలో నిలబడి అక్కడికెవరూ రాకుండా చూస్తున్నారు.

చీకట్లో ఏమీ తెలియడంలేదు. ఏంజరుగుతున్నదో అర్థంకాకుండా పోయింది. పావుగంట గడిచాక తిరిగి లైట్లు వెలిగాయి. జనం గాభరాగా తమ వాళ్లంతా ఉన్నారో తప్పిపోయారో చూసుకుంటున్నారు.

రథం ముందున్న వేదికపైన కార్యకర్తలు ఎవరిదో శరీరాన్ని పైకెక్కించి పడుకోబెడుతున్నారు. జనం ఆసక్తిగా అటువైపు తోసుకువెళ్ళారు.

"ఆగండి! నెమ్మది నెమ్మది. తొందరవద్దు" మైకులో తవగారు అంటున్నారు. జనం నెమ్మదిగా అటు కదిలారు.

"మహానుభావుడు! గంగాజలం కోసం ప్రాణాలనే అర్పించిన హైంద వుడు! ఇతని ధర్మం మనకాదర్శం కావాలి! పాపం, తొక్కిసలాడటలో కింద పడి నలిగి దైవసాన్నిధ్యాన్ని చేరుకున్నాడు" తనగద్గద కంఠంతో అంటున్నాడు.

జనం ఆ పుణ్యాత్ముడి భౌతిక కాయాన్ని దర్శించాలని వేగిర పడ్డారు.

"ఇలాంటి మరణం అందరికీ సాధ్యంకాదు. కోరుకుంటే వచ్చేదికాదు. సాక్షాత్తూ గంగాదేవిముందు మరణించటం మోక్షాన్ని పొందుటయే." తవ మళ్ళీ ప్రకటించాడు.

"పరమ భక్తుడైన ఇతని శరీరాన్ని పవిత్ర గంగాజలంతో అభిషేకం చేయిస్తున్నారు. బతికుండగా పొందలేకపోయినా అతని భౌతిక కాయాన్నయినా గంగాజలధారల్లో తడుపుదాం" అని తవ స్వయంగా బిందెలోని గంగాజలం ముత్తడి మృత దేహంమీద పోశాడు. అతడి తర్వాత పెద్దలందరూ తలా చెంబెడు గంగాజలం ఆ శవంమీద పోశారు.

మృతదేహాన్ని బంతిపూలదండతోనూ. కుంకుమతోనూ, అలంకరించారు. ఒక కాషాయవస్త్రాన్ని శరీరంమీద గాయాలు కన్పించకుండా కప్పారు.

బ్రాహ్మణులు ఏవో మంత్రాలు చదువుతూ పవిత్ర జలాలు ఆ దేహం మీద చిలకరిస్తుంటే జనం మృతదేహానికి నమస్కరిస్తూ అక్కడవున్న హుండీలో చేతనైనంత డబ్బువేస్తున్నారు.

# పోలీసు రాజ్యంలో సామాజిక విలువలు

మానవ సమాజం కాలక్రమంలో సంకీర్ణమవుతుంది. శ్రమలోనూ ఉత్పత్తిలోనూ వైవిధ్యం పెరిగే కొద్దీ కొత్త కొత్త విలువలూ, ఆదర్శాలూ సంప్రదాయాలూ, ఆచారాలూ పుట్టుకొస్తాయి. కొత్త సామాజిక సంప్రదాయం ఏదయినా అప్పటి ఒక వర్గం అవసరాలను సాధించడానికే పుడుతుంది. కాని ఈ సంకుచితమైన ప్రయోజనంతో బాటు ఒక విలువనూ ఆదర్శాన్నీ గూడ అది చరిత్రలోకి తీసుకొస్తుంది. పశువులను చంపితినడంకోసం పోషించిన దశను దాటి, పశువులను పాడికోసం వ్యవసాయం కోసం పోషించిన దశ వచ్చేసరికి "గొడ్లను చంపడం పాపం" అనే ఆచారం పుట్టుకొచ్చింది. ఇది వ్యవసాయదారుల అవసరాలను కాపాడే ఆచారమే, కాని దీనితోబాటు చరిత్ర లోనికి "జీవహింస తప్పు" అనే అస్పష్టమైన విలువ పుట్టుకొచ్చింది. రాజుల నిరంకుశత్వం యూరప్‌లో వ్యాపార వర్గాల విస్తరణకు అవరోధమయి వాళ్ళ అవసరాలను తీర్చడం కోసం ఎన్నికలూ పార్లమెంటులూ పుట్టుకొచ్చాయి. అయితే వాటితోబాటు ప్రాతినిధ్యపాలన అనే విలువ చరిత్రలోకి వచ్చింది.

---

కొందరు కార్యకర్తలు భజన ప్రారంభించారు. "భారతమాతాకుజై, గంగామాతాకుజై" అనే నినాదాలు చెలరేగాయి. అంతవరకూ ఏం జరిగిందో తెలియని ప్రజలు గంగాజలంకోసం క్యూలో నడుస్తూనే వున్నారు. ముత్తడి దేహాన్ని దర్శిస్తూనే వున్నారు.

వేదికమీద పక్కగావున్న అవ "నూటరెండు" అన్నాడు.

"ఏమిటి?" తవ అడిగాడు.

"వాడి ఒంటిమీద దెబ్బలు" అని చెప్పాడు.

తవ ఉలిక్కిపడి అవ చెయ్యి గట్టిగానొక్కాడు. అవ మళ్ళా ఏంవాగు తాడోనని మైక్ ముందుకు నడిచి "ప్రజలారా! భారతమాత తన బిడ్డణ్ని ఒడిలో లాలిస్తున్నది. రండి పవిత్రజలంకోసం ప్రాణాలను బలిపెట్టిన అతడిని దర్శిం చండి" అని ప్రారంభించాడు.

కాస్త దూరంగా నిలబడ్డ సాయన్న కోపంగా పళ్ళు పటపటకొరికాడు.

పరిపాలన అనేది వున్నంతకాలం పరిపాలించే వాళ్ళను ఎన్నుకునే హక్కు ప్రజలకు ఉండాలనే భావన వచ్చింది. కాలక్రమంలో సంకుచిత వర్గ ప్రయోజనం కాలం చెల్లిపోతుంది. ఆ సంప్రదాయం ప్రగతికి ప్రతిబంధకమవుతుంది. కాని ఆ విలువలు మాత్రం పరిణత రూపంలో నిలిచిపోయి కొత్త వ్యవస్థలో కొత్త అవసరాలను తీర్చగల సంప్రదాయాలను సృష్టిస్తాయి. వ్యవస్థలు నశిస్తాయి, సంప్రదాయాలు నశిస్తాయి. కానివాటితో పుట్టిన మానవ విలువలు నిత్యపరిణామంలో వ్యాపిస్తూనిత్యం కొత్త సంప్రదాయాల రూపం తీసుకుంటూ వుంటాయిగాని ఒకంతటనాశనంకావు. ఉపరితలంమేరకు ఇదే నాగరికత ప్రగతిగామనకు కనిపిస్తుంది. ఉత్పత్తి పద్ధతులు ఏ విధంగానయితే పాతను కొత్తలో నిక్షిప్తం చేసుకుంటూ శాఖోపశాఖలుగా చీలుతూ విస్తరిస్తుందో, దాని ప్రతిబింబమయిన విలువలు గూడ అంతే. ఐదు వేల సంవత్సరాల నాగరికతా చరిత్ర క్రమంలో పోగయిన విలువలు, వాటిని నిక్షిప్తం చేసుకున్న సంప్రదాయాలూ — వీటి సంకీర్ణమయిన కలయిక ఆధునిక సంస్కృతి ఆధునిక సంస్కృతిలోని ఈ విలువలూ, సంప్రదాయాలూ మూలంలో ఎంత ప్రాచీనమయినా వాటికి ఆధునిక వర్గ స్వభావం ఉంటుంది. అయితే ఈ సంకీర్ణతలోని ఒక అంశం ఏమిటంటే ఆ వర్గ స్వభావం అంతిమ విశ్లేషణలోని స్వభావం మాత్రమే. అంటే, అంతా బాగున్నప్పుడు ఆవర్గస్వభావం ఎంతో విశ్లేషిస్తే తప్ప పైకి కనిపించదు. విలువలకూ సాంప్రదాయాలకూ స్వయం ప్రతిపత్తి ఉన్నట్టు తోస్తుంది. శ్రమలోనూ ఉత్పత్తిలోనూ వినిమయంలోనూ వైవిధ్యం పెరిగేకొద్దీ ప్రతివిషయనికీ సాపేక్షకస్వయం ప్రపతిత్తి పెరుగుతుంది. కాని సంక్షోభం తీవ్రమయి వర్గపోరాటం ప్రత్యక్షమయినప్పుడు ఆ స్వయంప్రతిపత్తి నాశనమయి ఆవిలువలూ సంప్రదాయాలూ తమ ఆధునిక వర్గస్వభావాన్ని కనబరుస్తాయి. పాలక వర్గాల అవసరాలను తీర్చగల రూపాన్నితీసుకుంటాయి. అది సాధ్యం కానప్పుడు తాము నాశనమయిపోతాయి. సంక్షోభంలో అన్నీ గూడా ప్రజలవైపో ఫాసిజంవైపో నిలవాలి. లేకపోతే తమ్మతాము అభావం చేసుకోవాలి. సంక్షోభాలు అనివార్యం అని మార్క్సిజం సైద్ధాంతికంగా రుజువుచేసినట్టే సంక్షోభాలు అనుభవాత్మకంగా మార్క్సిజాన్ని రుజువు చేస్తాయి. "నావర్గ స్వభావం ఏమిటో చెప్పమ"ని సవాలు చేసినవన్నీ గూడ సంక్షోభసమయంలో తమ వర్గ స్వభావాన్ని తామే చూపుతాయి. అవసర

మయితే అందుకోసం తమ మానవీయ అంశను అభావం చేసుకొని మరీ చూపుతాయి.

"గురుసాక్షాత్ పరబ్రహ్మ" అని చిన్నప్పుడు అందరం వల్లెవేసాము. విద్య పవిత్రమయినది, విద్యాలయాలు పవిత్ర స్థలాలు, అనే విలువలు ఫ్యూడల్ సంస్కృతిలో భాగం. చారిత్రకంగా అవి బ్రాహ్మణాధిక్యతను, ఫ్యూడల్ వ్యవస్థను అవశ్యమయిన అజ్ఞానాన్ని నిలబెట్టడానికి పనికివచ్చాయి. కాని ఆ వ్యవస్థ చాలా వరకు నాశనమయిపోయిన తరువాత గూడ విజ్ఞానం ఆదరణీయమనే విలువ మిగిలిపోయింది. ఈ విలువ మహోన్నతంగాను తటస్థంగాను కనిపిస్తుంది. విజ్ఞానం కోసమే జీవించే వాళ్ళు తమకు ఏ వర్గ స్వభావంలేదనీ, తాము సామాజిక సంక్షోభాలకు అతీతులమనీ, తమ జీవితం మార్క్సిజానికి అపవాదమనీ ఖిడిసిపడతారు. అవునేమోనని మనకు గూడ అనిపిస్తుంది. సామాజిక సంక్షోభం తీవ్రమయ్యే వరకు. సంక్షోభం తీవ్రమయి వ్యవస్థను సమూలంగా నాశనం చేయగల రాజకీయం కళాశాలలలోకి ప్రవేశించి వ్యాపించడం మొదలు పెడితే, ఉన్నదున్నట్టుగా "విద్యపవిత్రం" అనే భావానికి అర్థమే మారిపోతుంది. విద్యాలయాలు పాఠ్యపుస్తకాల విజ్ఞానానికి మాత్రమే పరిమితం కావాలి తప్ప అక్కడికి రాజకీయాలు ప్రవేశించగూడదు. అనే అర్థంపుట్టుకొస్తుంది. ఒక్కసారిగా ఆ మహోన్నతమయిన విలువ ఫాసిస్టుకంపు కొట్టటం మొదలు పెడుతుంది. పాఠ్యపుస్తకాలు మాత్రమే ఎందుకు పవిత్రం, రాజకీయాలు ఎందుకు అపవిత్రం, అని ప్రశ్నించకండి. ఫాసిజానికి విశ్వాసమే తప్ప తర్కంతో పనిలేదు. విజ్ఞానాన్ని గౌరవించడం అనే సార్వత్రికమయిన విలువ నిర్దిష్ట సమాజంలో నిర్దిష్ట పరిస్థితులలో నిర్దిష్ట రూపం తీసుకోకతప్పదు. ఆ రూపాన్ని తర్కంతో ఎదుర్కోగలమని భావించడం హేతువాదులభ్రమ.

అప్పుడిక పోలీసులు విద్యాలయాలలోకి ప్రవేశించి విద్యార్థులను చితకబాది పట్టుకుపోతుంటే "సాక్షాత్ పరబ్రహ్మ"లయిన గురువులు నోరు మెదపరు ఎందుకని అడగకండి. మీరు అంతవరకు విద్వత్సంపన్నులుగా ఎంతగానో గౌరవించిన వారి నోటి నుంచి వింతవాదనలు బయటికొస్తాయి. "ఈ తీవ్రవాద రాజకీయాలతో విద్యాలయాలను కలుషితం చేసిన తరువాత పోలీసులు రావడం అనివార్యం" అంటారు. తీవ్రవాదమో మితవాదమో, రాజకీయ విజ్ఞానంలో

భాగమే గాని లాఠీలు కావని వాదించి ప్రయోజనంలేదు. మీరిప్పుడు తటస్థమయిన జిజ్ఞాసతో మాట్లాడడంలేదు. సంక్షోభం మందకొడిగా వున్నప్పుడు ఆకాశమార్గంలో అన్నిటికీ అతీతంగా వున్నట్టు కనబడుతూ విహరించిన జిజ్ఞాస ఇప్పుడు సంక్షోభం తాకిడికి నేలరాలింది. ఇప్పుడది రాజకీయాన్నిగూడ విద్యలో భాగంగా గుర్తించదు. ఇది దాని నిర్దిష్ట రూపం.

కళాశాల ఆవరణలో పోలీసుల దౌర్జన్యాన్ని ఉపేక్షించడం మాత్రమే కాదు. విద్య పవిత్రం అనే భావన తన్నుతాను అభావం చేసుకోవడం అంతకు ముందే ప్రారంభమవుతుంది. వరంగల్‌లోని ప్రభుత్వ పాలిటెక్నిక్ ప్రిన్సిపాల్ తన విద్యార్థులు కళాశాల మేగజైన్ కోసం ఎంపిక చేసిన 20 వ్యాసాలూ కవితలూ వగైరా అంశాలలో అయిదింటిని మాత్రమే ఆమోదించాడు. అవి మాత్రమే సాంకేతిక విజ్ఞానానికీ ఇతర ఆమోదనీయమయిన విషయాలకూ సంబంధించిన వనీ, తక్కినవన్నీ "రాజకీయ" విషయాలనీ ఆయన అభ్యంతరం తెలిపాడు. విజ్ఞాన కాంక్షకు ఇంతకు మించిన అభాస రూపం మరొకటి ఉండదు. ఇంత పని చేసిన తరువాత ఆయన తన కాలేజీకి పోలీసులను పిలిపించి పిల్లలను పట్టించినా, క్యాంపు పెట్టించి కొట్టించినా, పోలీసులు తెల్లబట్టలతో రూము రూముకూ తిరిగి పిల్లలను బెదిరించినా, రాత్రిపూట మట్వాడ యస్.ఐ. హాస్టల్ బోర్డర్లందరినీ ఒక గదిలో కూర్చోబెట్టి వాళ్ళకు రాజకీయ పాఠాలు చెప్పినా, ఆశ్చర్యం ఏముంది? గురువులు పోలీసుల పనిచేస్తే పోలీసులు గురువులు కాకుండా ఏమవుతారు?

తానే పోలీసు భారం మీదవేసుకొని వ్యాసాలనూ కవితలనూ సెన్సార్ చేయడం మొదటిమెట్టు. ఆపని పోలీసులకే అప్పజెప్పడం రెండవమెట్టు. కవితలూ వ్యాసాలూ మాత్రమేకాదు, ఉపన్యాసాలను గూడ పోలీసులు సెన్సార్ చేస్తారు. ఒక సంవత్సరంగా వరంగల్‌లో ఏ కళాశాలలోనయినా ఎవరు ఉపన్యాసం ఇవ్వాలన్నా దానికి పోలీసుల అనుమతి ఉండాలి. అనుమతి లేకుండా సమావేశం జరుపుకోదల్చుకుంటే సెక్షన్ 144 ప్రకటించిన సందర్భాలు ఉన్నాయి. కాలేజీ మేగజైన్‌లో "అభ్యంతరకరమయిన" విషయాలున్నాయని టవున్ సర్కిల్ ఇన్స్‌పెక్టర్ ప్రకటిస్తే యూనివర్సిటీ ప్రిన్సిపాల్ ఆ మేగజైన్ ముద్రణ ఆపిస్తాడు. సమావేశాలకు మీ అనుమతి ఎందుకనిగాని, "అభ్యంతర

కరమయిన" విషయాలంటే అర్థమేమిటనిగాని ఆయన ప్రశ్నించడు. విశ్వ విద్యాలయాల స్వయంప్రతిపత్తిని తాకాలలో తాకట్టుపెట్టి జమేదార్ పని చేస్తున్నారు. ప్రిన్స్‌పాల్ వి.సి.లు. ఇప్పుడు ఆ జమేదార్ హోదానుండి ప్రమోషన్ కోరుతూ తమకే మేజిస్టెరియల్ అధికారాలు ఇవ్వాలని ప్రభుత్వాన్ని అడుగుతున్నారట. విద్యాలయాలను పోలీసులకయినా అప్పజెప్పాలి, లేదా తామే పోలీసులయినా కావాలి- "విద్యాలయాలు పవిత్ర స్థలాలు" అనే విలువను వదిలి మనం ఇవ్వాళ చాలాదూరం వచ్చాము.

అయితే మనం తీసుకునే ఏ చర్యకయినా దాని తర్కం గతితర్కం దానికుంటాయి. ఒక పనిచేసేంత వరకే మన ఇష్టం. తరువాత పర్యవసానాలు మన ఇష్టాయిష్టాలమీద ఎంతఆధారపడి ఉంటాయో వాటి స్వాభావిక(సామాజిక) క్రమంమీద అంత ఆధారపడి ఉంటాయి. పంతుళ్లు పోలీసులపనీ పోలీసులు పంతుళ్లపనీ చేయడం మొదలు పెట్టిన తరువాత ఈ పరకాయప్రవేశానికి (లేక పరస్పరకాయప్రవేశానికి) స్వాభావిక మయిన గతితర్కం పనిచేయడం మొదలు పెడుతుంది. మామూలుగా మేధావులకు పోలీసు యంత్రాంగం అంటే ఎంత హీనభావం ఉంటుందో ఇప్పుడు ఈ తలక్రిందులు పరిస్థితిలో పోలీసులకు మేధావులంటే అంత హీనభావం పుడుతుంది. పోలీసు యంత్రాంగం మీద సెమినార్ నిర్వహించమని మేధావులను పురమాయించి మాజీ ఐజిపి రాంచంద్ర రెడ్డి మేధావుల సమీక్షకు ముగింపు మాటలు పలుకుతాడు. హేయంగా మాట్లాడ తాడు. మనసులో గింజుకోవడం భుజాలు తడుముకోవడం తప్ప ఆ మేధావులు చేయగలిగిందిలేదు. హనుమకొండ ఎస్. ఐ. తన ఠాణా ప్రక్కనే వున్న ప్రభుత్వ జూనియర్ కళాశాలలోకి నిత్యం నిరాటంకంగా జొరబడి ప్రిన్స్‌పాల్ గదిలోకి లాఠీ ఊపుకుంటూ పోయి, అటెండర్‌ను పంపి విద్యార్థి నాయకులను పిలిపించి ప్రిన్స్‌పాల్ సమక్షంలో వాళ్లను బూతులు తిడతాడు. "శాంతిభద్రత లను" ఈ విధంగా గూడ కాపాడవచ్చునని ఆయనగారి నమ్మిక. చెవులు మూసుకోవడం, తల చేతులలో పట్టుకోవడం వినా ఆ ప్రిన్సిపాల్ దౌర్భాగ్యుడు చేయగలిగిందిలేదు. కాకతీయ యూనివర్సిటీ ఆవరణలో ఎన్నికల ప్రచారం నిమిత్తం తిరుగుతున్న ఒక అమ్మాయిని పోలీసులు పట్టుకుపోతారు. అపుట్

పోస్టులో ఆమెను కొడతారు. బూటుకాలుతో పాదాలను తొక్కుతారు. ప్రిన్సిపాల్ ఫోన్ చేసి ఆ అమ్మాయి చేసిన నేరం ఏమిటని ప్రశ్నిస్తే "ఆమె సాయం కళాశాల విద్యార్థిని కాబట్టి నీకు అనవసరం పొమ్మం"టారు. అధికారానికి "జూరిస్డిక్షన్" ఉంటుంది. కాని మానవత్వానికీ ప్రజాస్వామ్యానికీ "జూరిస్డిక్షన్" ఉండదు. అవి సార్వత్రికం సార్వకాలికం, సార్వజనీనం. ఇది మామూలు పరిస్థితి. మానవత్వమూ ప్రజాస్వామ్యమూ వర్గపోరాటానికి అతీతంగా కనబడే పరిస్థితి. కాని ఈ సంక్షోభసమయంలో పోలీసులకూ అధికార్లకూ "జూరిస్డిక్షన్" పోతుంది. జిల్లాకలెక్టర్ జిల్లాపాలనా వ్యవహారాల నిర్వహణ వదిలిపెట్టి నక్సలైట్లను అణిచేస్తానని పబ్లిగ్గా ఉపన్యసిస్తాడు. ట్రాఫిక్ ఇన్స్పెక్టర్ ఇంటరాగేషన్ చేస్తాడు. రూరల్ కీ డి.ఎస్.పి. టౌన్ లో లాఠీచార్జి చేయిస్తాడు. పోలీసులు నీతిని గురించి బోధిస్తారు. "వాళ్లకు ఆ హక్కు ఉన్నదట" అని పి హెచ్ డి పట్టభద్రులయిన మేధావులు విస్మయంపోతారు. కాని మానవత్వానికీ ప్రజాస్వామ్యానికీ "జూరిస్డిక్షన్" ఏర్పడుతుంది. నన్ను నలుగురిలో చావబాదుతుంటే ప్రశ్నించడానికి నీకు సాటి మానవుడివన్న అర్హత చాలదు. నువ్వు నా అన్నవా? తల్లివా? తండ్రివా? నేను చదువుకునే కాలేజీ ప్రిన్సిపాల్ వా? ఏదీ కాకపోతే "నీది నువ్వు కడుక్కోమ్మ"ని అమర్యాదగా సమాధానం వస్తుంది. మన్నించకుంటే "విధి నిర్వహణలో ఆటంకపరిచావు" అని కేసవుతుంది.

మరి నీతిని బోధించే వాళ్ళు పోలీసులయితే నీతిని బోధించవలసిన గురువులు ఏమవుతారు? పోలీసులకు ఇనఫార్మర్స్ అవుతారు. వరంగల్ లో కాలేజీ ప్రిన్సిపాల్ గానో యూనివర్సిటీ వి.సి.గానో హాస్టల్ వార్డెన్ గానో వుండి పోలీసులకు ఇన్ఫార్మర్స్ కాని వాళ్ళు చాలా కొద్ది మంది వాళ్ళలో కొందరు బలవంతం మీద ఆ పాత్ర స్వీకరించే వాళ్ళుండవచ్చునుగాని, అత్యధికులు నిరభ్యంతరంగా గూఢచారులయ్యేవాళ్ళే. అధికార నిచ్చెన మీద పైకి పోవాలంటే "పోలీస్ రిపోర్టు" ప్రతికూలంగా వుండకూడదు. ఇది సార్వత్రికసత్యం. దీన్ని తలమీద నిలబెడితే, పోలీస్ రిపోర్టు ఎంత అనుకూలంగా వుంటే నిచ్చెన మీద అంతత్వరగా పైకిపోతారు. ఇది ఫాసిస్టు సత్యం. వరంగల్ లో ఇవ్వాళ కళాశాలల అధికార్లు, యూనివర్శిటీ అధికార్లు, జిల్లా కలెక్టరూ, కోర్టులలో

న్యాయమూర్తులూ, అన్ని రంగాల ప్రభుత్వ అధికార్లు, మినహాయింపు లేకుండ అత్యధిక భాగం పోలీసు ఏజెంట్లే. ఇవన్నీ గూడ ఆధునిక ప్రజాస్వామ్యాలలో స్వయంప్రతిపత్తిగల హోదాలే. అయిదువేల సంవత్సరాల మానవ నాగరికత క్రమంలో సంతరించుకున్న మానవీయ విలువల నిక్షేపాలే. కాని ఈ విప్లవాల యుగంలో అన్నీ గూడ ఫాసిస్టు బూట్లకు నాడాలు కాకతప్పలేదు. పదిపదిహేను రోజులు లాకప్‌లో చిత్రహింసలు పెట్టి కోర్టుకు తీసుకొస్తే నిందితుడిని న్యాయమూర్తులు కన్నెత్తి కూడ చూడరు. చూస్తే ఏం కనబడుతుందోనని తలదించుకొని రిమాండ్ చేస్తారు. వ్యవసాయ కూలీలను పోలీసులు తప్పుడు కేసులలో ఇరికించి ప్రమాదకరమయిన నక్సలైట్లుగా చిత్రిస్తారు. వాళ్ళను దీర్ఘకాలం జెయిల్లో పడేస్తే వాళ్ళ కుటుంబాల గతిఏమిటన్న ఆలోచన లేకుండ వాళ్ళకుబెయిల్ ఇవ్వడానికిమున్పెరిప్పలు పెడతారు. ఒకవేళ బెయిలు మంజూరయినాష్యూరిటీలను కోర్టు ఆవరణలోనే పోలీసులు అరెస్టుచేస్తారు. లేకపోతే బెయిలుమీద బయటకు రాగానే జెయిలు బయట అరెస్టుచేసి ఇంకొక కేసులో కోర్టుకు తెస్తారు. నిన్ననే బెయిలిచ్చిన వాడిని మళ్ళీ ఇంకొక కేసులో తెచ్చారేమిటని జడ్జిగారు ఆలోచించరు. తలవంచుకొని మళ్ళీ రిమాండ్ చేయడం వారిపని. భగవద్గీతలో చెప్పినట్టు మంచి చెడ్డల భారం నారాయణుడిది. మూర్తీభవించిన న్యాయం న్యాయమూర్తి అతను అప్పటి చట్టలనయినా కనీసం నిష్పక్షపాతంగా అమలుచేసి వీలయినంత ప్రజాస్వామికంగా వాటిని వ్యాఖ్యానించాలి. ఈవిధి, ఈ స్వయంప్రతిపత్తి. ఇన్నివేల సంవత్సరాల నాగరికత సాధించిన ఆదర్శం. సంక్షోభంలో ఇవన్నీ పోతాయి, న్యాయమూర్తులలో న్యాయం మూర్తీభవించదు, ఘనీభవిస్తుంది. వారి పంచేంద్రియాలలో ఏదీ పని చేయదు. యండమూరి వీరేంద్రనాథ్ కల్పనలలో లాగ వారి మెదళ్లు "స్పెషల్ బ్రాంచి"కి "ట్యూన్" అయివుంటాయి.

అన్నిటినీ ప్రశ్నించడం ఒక ఉన్నతమయిన నాగరికతా విలువ. ఇప్పుడు దానికిక స్థానంలేదు. ప్రశ్నించడం మానేసి పోలీసుల సమాధానాన్ని తమకు తామే చెప్పుకొని సంతృప్తి చెందడం ఫాసిస్టునీతి. అర్ధరాత్రి వార్డెన్‌ను అడగకుండ ప్రిన్సిపాల్‌కు చెప్పకుండ హాస్టళ్ళమీద దాడిచేసి విద్యార్థులను నిద్రలేపి బూతులు తిడుతూ రూములు సోదాచేసి పుస్తకాలూ కాగితాలూ తీసుకు పోతారు.

గంటల తరబడి హాస్టల్ రూములోనే ఇంటరాగేట్ చేస్తారు. ఎందుకని ప్రశ్నించ కండి. "ఎవరో వాంటెడ్ పర్సన్స్ హాస్టల్‌లో దాక్కొన్నారట" అన్న సమాధానం వస్తుంది. వాంటెడ్ పర్సన్స్ అన్నమాటలు ఎట్లా పలుకుతారంటే హంతకులో బందిపోట్లో మాదర్‌చోద్‌లో అనుకోవాలి. ఒకవ్యక్తిమీద అరెస్టు వారంట్లు ఉండాలంటే అతను భయంకరమయిన నేరస్తుడు కానవసరంలేదని, పోలీసులు ఎవరిమీదనయినా ఏక్షణమయినా వారంట్లు సంపాదించగలరనీ చెప్పండి ఒక్కసారిగా విచక్షణాద్వారాలు మూసుకుపోతాయి. ఆలోచన కుంచించుకు పోతుంది. "ఏమో నాకవన్నీ తెలీవు. నేనేదో నాఉద్యోగమేదో...." విజ్ఞానతృష్ణ ఇప్పుడిక అఖండం కాదు. మెదడుచుట్టూ ఇప్పుడొక పరిధి ఏర్పడుతుంది. దాని వెలుపల చీకటి, శూన్యం, అందులోకి ఆలోచనా కిరణాలు ప్రసరించవు. ఆలోచనకు జూరిస్డిక్షన్ ఏర్పడుతుంది. ఆలోచనకూ కుతూహలానికీ ప్రజాస్వామ్యానికీ మానవత్వానికీ అన్నిటికీ జూరిస్డిక్షన్ ఏర్పడుతుంది-ఒక్క అధికారం మాత్రమే పట్టపగ్గాలు లేకుండా పోతుంది. నాగరికతా విలువలన్నీ తలక్రిందు లయినాయి. అపరిమితం కావలసిన వాటికి శృంఖలాలు తగులుకున్నాయి. పరిమితం కావలసిన అధికారం మాత్రం విజృంభించింది.

ఈ సంకెళ్ళు చాలా వరకు తమకు తాము తగిలించుకున్నవే. తగిలించే భారం కూడ పోలీసులమీద లేదు. పోలీసు అత్యాచారాల గురించి స్థానికపత్రికా విలేకరులు ఎందుకు రాయడంలేదని ఎవరో అమాయకంగా ప్రశ్నిస్తే, అది పోలీసుల "మొరేల్"ను దెబ్బతీస్తుందని "హిందు" పత్రిక విలేఖరి సమాధానం చెప్పాడట. దెబ్బతీస్తే ఏమవుతుంది? వాళ్ళు తీవ్రవాదులను అణచలేకపోతారు. అణచలేకపోతే ఏమవుతుంది? తమ పునాదులు కదిలి పోతాయి. కదిలిపోతున్న పునాదుల ముందర పత్రికా స్వాతంత్ర్యం అతి చిన్న విషయం. పత్రికా స్వాతంత్ర్యం, అభిప్రాయస్వేచ్ఛ, ఉన్నతమయిన బూర్జువా విలువలు. నిరంకుశ రాచరికానికి వ్యతిరేకంగా పోరాడి ప్రాణాలొడ్డి సాధించుకున్న విలువలు. మామూలు సందర్భాలలో కూడ అవి తటస్థం కావు. కాని వర్గ పోరాటం ప్రత్యక్షమయినప్పుడు వాటికి మనుగడే లేదు.

ప్రభుత్వం ఇవ్వాళ ప్రజలమీద యుద్ధ ప్రకటించింది. యుద్ధ శిబిరాలగా గ్రామాలలో పోలీసు క్యాంపులను నెలకొల్పింది. వరంగల్ జిల్లాలో ప్రస్తుతం

కనీసం పది పదిహేను గ్రామాలలో పోలీసు క్యాంపులున్నాయి. క్యాంపులలో మగవాళ్ళను వారాల తరబడి కూర్చోబెట్టి నిత్యం చావగొడుతున్నారు. వాళ్ళను కూలిపనికి పోనివ్వరు, పంటలు కోసుకోనివ్వరు. వాళ్ళచేత వెట్టిచాకిరీ చేయించు కుంటారు. ఇళ్ళమీద దాడిచేసి ఆడవాళ్ళను కొడుతున్నారు. భట్టుపల్లిలో లచ్చమ్మ అనే యాభై సంవత్సరాల స్త్రీని స్పృహ తప్పేదాక కొట్టి ఇంటి ముందర పడేస్తే ఆమె కొడుకు ఆమెను ఆస్పత్రికి తీసుకుపోవలసి వచ్చింది. ఆ తరు వాతే, అంతవరకు (45 రోజులుగా) గ్రామంలోని పోలీసు క్యాంపులో నిర్బంధించబడి ఉండిన ఆమె భర్త కుదయ్యను వదిలిపెట్టారు — భార్యను చూసుకొమ్మని. ఆసుపత్రి నుండి పూర్తిగా కోలుకోకముందే విడుదలయి లచ్చమ్మ కూతురి ఇంటిలో ఉంటోంది. కుదయ్య తిరిగి భట్టుపల్లికి పోతే మళ్ళీ క్యాంపులో పెడతారేమోనని భయపడి తాను పనిచేసే కాజీపేట రైల్వే ప్లాట్ ఫారం మీదనే బ్రతుకుతున్నాడు. బయటినుండి పత్రికా విలేఖరులుగాని పౌరహక్కుల సంఘాలవాళ్ళుగాని గ్రామానికిపోతే వాళ్ళతో మాట్లాడినందుకు మళ్ళీకొడుతున్నారు. మల్లారెడ్డిపల్లె, వెంకటాపురం, కృష్ణాజీగూడెం, దేవరుప్పల, అన్నిఊళ్ళలోనూ ఇదేకథ. వెంకటాపురంలోనూ మల్లారెడ్డిపల్లెలోనూ ఇళ్ళ లోని దూలాలనూ పందిళ్ళనూ విరగ్గొట్టి ఆ కట్టెతో పోలీసులు క్యాంపులో చలి కాచు కుంటున్నారు. మల్లారెడ్డిపల్లెలో 36 భూమిలేని కుటుంబాలు కలిసి దున్నుకున్న 20 ఎకరాల భూమిని పశువులకు మేపారు. క్యాంపులో నిర్బంధించిన వాళ్ళచేలను కోసుకోనివ్వరు. ఒక్కొక్క గ్రామంలోనూ 40-50 ఎకరాలలో వరిపంటను కోయకుండ ఆపారు. క్యాంపులో కొట్టే దెబ్బలనయితే వర్ణించ డానికి వీలుకాదు. అన్ని ఊళ్ళలోనూ జనం గతంలో దెబ్బలుతిన్నవారే. కాని "ఇట్లాంటి దెబ్బలు ఎన్నడూ తినలేద"ని ఇవ్వాళ అందరూ అంటున్నారు. బోర్లాపడుకోబెట్టి కాళ్ళు రెండూ వెనక్కి కట్టేసి వీపుమీద కూర్చొని అరగంట సేపు నిర్విరామంగా కొడతారు. ఒకరోజుకాదు, రెండురోజులుకాదు, వారాల తరబడి నిత్యం ఇలా కొడతారు. లేకపోతే అందరినీ గుంద్రంగా కూర్చోబెట్టి ఒకరినొకరు చెప్పులతో కొట్టుకొమ్మని బలవంతం చేస్తారు. చెప్పులలోని మేకులవల్ల వీపుమీద గాయాలయిన వాళ్ళున్నారు.

ఈ క్యాంపులన్నీ ఒక ఎత్తయితే మడికొండ లాకప్ అనే చిత్రహింసల కేంద్రం మరొక ఎత్తు. ఎన్నడయినా ఏ సమయంలో నయినా మడికొండ లాకప్‌లో కనీసం 15 మంది అక్రమ నిర్బంధంలో ఉంటారు. వాళ్ళను ఎంత చలిలోనయినా నగ్నంగా వుంచుతారు. బోర్లాపడుకోబెట్టి రోకలిబండలు ఎక్కించి అరగంట, ముప్పావుగంట చితక గొడతారు. ఒకరి మూత్రం ఒకరిచేత త్రాగిస్తారు. అసభ్యకరమయిన లైంగిక చర్యలు చేయిస్తారు.

ఇవన్నీ "శాంతి, భద్రతల" సంరక్షణకోసం జరుగుతున్నాయని ఎవరయినా అనుకుంటే పొరబాటే. రైతాంగ ఉద్యమ కార్యకర్తలను ఏరి వేయడం కోసం ఇవన్నీ జరుగుతున్నాయి. ఏదో ఒక సంఘటన జరిగిందని పెట్టిన క్యాంపులుకావు ఇవి. గ్రామీణ ప్రాంతాలలో చైతన్యవంతమవుతున్న పేదప్రజానీకాన్ని శాశ్వతంగా అణిచివేయాలని నాలుగయిదు జిల్లాలలో విస్తృతంగా అమలు చేస్తున్న నిర్బంధంలో భాగం యిది. ఏదో ఒక సాకుచెప్పి (ఏదీ దొరక్కపోతే అల్లరి సృష్టించి) గ్రామాలలోకి ప్రవేశించి క్యాంపులుపెట్టి స్థానిక కార్యకర్తలందరినీ పట్టుకోవడంకోసం వేటాడుతున్నారు. భూస్వాముల చేత హత్యలు చేయించి దానికి "ఆత్మ రక్షణ" ముసుగుతొడిగి హత్యచేయబడ్డ వాళ్ల బంధుమిత్రులనే హింసిస్తున్నారు. భట్టు పల్లిలో క్యాంపు ఈ విధంగా వచ్చినదే. అక్టోబర్ 30 నాడు గ్రామంలో ఒక ప్రజాపంచాయితీ దగ్గర రవీందర్ అనే రాడికల్ యువకుడిని కొందరు రెడ్లు చంపారు. అతన్ని చంపడం కాక మరికొందరిని గాయపరిచారు. గాయపడ్డవాళ్లు ఆస్పత్రికి, అక్కడినుండి జెయిలుకు, వెళ్లారు. హంతకులు మాత్రం పోలీసుల సంరక్షణలో సురక్షితంగా వున్నారు. వాళ్ల దగ్గర అసలు ఆయుధాలే లేవనీ రాడికల్స్ వాళ్లమీద దాడిచేస్తే ఆత్మరక్షణార్థం ఆ ఆయుధాలను లాక్కొని రవీందర్‌ను చంపవలసి వచ్చిందనీ పోలీసులు కథసృష్టించారు. సృష్టించి గ్రామంలోని చర్చిలో పోలీసుక్యాంపుపెట్టి అప్పటినుండీ ఇప్పటిదాకా గ్రామంలోని పేదలనువిపరీతమయిన హింసకు గురి చేస్తున్నారు. దొరికిన యువకులందరినీ మడికొండకు తీసుకుపోయి తమ సంరక్షణలోవున్న రవీందర్ హంతకులకు చూపించి వాళ్లు "రాడికల్స్" అని గుర్తించిన వాళ్ళను విపరీతమయిన చిత్ర హింసలకు గురిచేసి హత్యా ప్రయత్నం కేసులో జెయిలుకు పంపుతున్నారు. యువకులు దొరకకపోతే తండ్రులను

క్యాంపులో కూర్చోబెట్టి చిత్రహింసలకు గురిచేస్తున్నారు. తమ చేతికి చిక్కకుండ యువకులెవరయినా నేరుగా కోర్టుకు సరండర్ అవుతారేమోనని కోర్టు దగ్గర మాటేసి అక్కడికి వచ్చినవాళ్ళను గేటు దగ్గరి నుండే తన్నుకు పోతున్నారు.

పల్లారెడ్డిపల్లెలో సీలింగ్ భూములను భూస్వాములు అమ్ముకునే ప్రయత్నం చేస్తే ప్రజలు నిరోధించారు. ఆ భూస్వాములు పోలీసులకు ఫిర్యాదు కూడ చేయలేదు. పోలీసులే కేసున మోపుచేసుకొని ఊళ్ళో క్యాంపు పెట్టారు. వెంకటాపురంలో చెరువుశికం, పోరంబోకులు, దున్నుకున్నారు. చట్టరీత్యా ఎవరికి ఆ భూములు చెందాలో వాళ్ళే దున్నుకున్నారు. కాని వాళ్ళకు దక్కింది పట్టాకాదు, ఊరి బడిలో నెలకొల్పిన పోలీసు క్యాంపు.

ఇట్లా ఒక్కొక్క ఊళ్ళోను సందర్భం కల్పించుకొని క్యాంపులు పెట్టి పేదరైతు కుటుంబాలను చెట్టుకూ పుట్టకూ చేస్తున్నారు. యువకులు దొరికితే ఆత్మకూరులోనో, హసన్‌పర్తిలోనో, మడికొండలోనో పది పదిహేను రోజులు తోమి తోచిన కేసులుపెట్టి జెయిలుకు పంపుతున్నారు. వరంగల్ సెంట్రల్ జెయిలు నిండిపోయి గత రెండు నెలలగా రాజమండ్రికి, విశాఖపట్నంకు పంపుతున్నారు. యువకులు దొరక్క పోతే తండ్రులను క్యాంపులో నిర్బంధించి కూలికి పోనీక పంట కోసుకోనీయక హింసిస్తున్నారు. ఇట్లా ఎన్ని కుటుంబాలను నాశనం చేసారో ఎవరికీ తెలీదు. పేద రైతు కుటుంబాలలో కాళ్ళు రెక్కలూ బాగున్న వాళ్ళు ఒక్కరూ గ్రామాలలో ఉండడంలేదు. క్యాంపులున్న గ్రామాలు పదయితే ఈ హింసను అనుభవిస్తున్న గ్రామాలు పదినాలుగుల నలభై ఉంటాయి. మగవాళ్ళు జెయిలుకో గుట్టలలోకో పోగా ఆడవాళ్ళు ఈ చలి రాత్రులలో ఒంటరిగా పోలీసు జీపుకోసం నిరీక్షిస్తూ కాలం గడుపుతున్నారు. నిరుడు ఇవే చలిదినాల్లో ఎన్టీఆర్ కోసం ఎదురు చూసారట. అప్పుడు వాడు ఖాకీ బట్టలలో వచ్చి "అమ్మా! అక్కా! చెల్లె! అని వోట్లడిగాడు. ఇప్పుడు వాడు ఖాకీ వదిలి కాషాయం ధరించాడుగాని వాడి ప్రేతం అవే ఖాకీ బట్టలలో వూళ్ళు తిరుగుతూ ఇంటి తలుపులు విరగ్గొట్టి "నీ కొడుకెక్కడే లంజా?" అని మీద పడుతోంది.

## "సాహిత్య అకాడమీ అవార్డును కొసకాలితో గూడా ముట్టను! శ్రీమతి శ్యామలా చెరబండరాజు ప్రకటన

చివరి ఊపిరి వరకూ సాయుధ ప్రజావిప్లవానికే తన కలాన్నీ కాలాన్నీ అంకితం చేసిన చెరబండరాజు, ఈ ప్రభుత్వానికో, ఆ ప్రభుత్వానికో మాత్రమే గాక నేటి దోపిడి రాజ్యవ్యవస్థ కంతటికీ బద్ధ విరోధి అయిన సాహిత్య విప్లవ కారుడు. ఈ దుష్టవ్యవస్థ అంతర్భాగాలే అకాడెమీలన్నీ. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ కార్యదర్శి శ్రీ ఇరివెంటి క్రిష్ణమూర్తి నాకొక ఉత్తరం రాస్తూ చెరబండరాజు నవల ప్రస్థానం ఉత్తమ నవలగా ఎంపికైనట్టు, దీనికి గుర్తింపుగా రు. 2500/- నగదు బహుమతిని ఇవ్వబూనినట్టూ తెలియ బరుస్తూ దానికి నా ఆమోదం కోరారు. చెరబండరాజుతో కలిసి రెండు దశాబ్దాలు కాపురం చేసిననాకు. ఆయన గుండె కదలికా, ప్రతి ఆలోచనా పూర్తిగా తెలుసు. బహుమతి పేరిటి ఈ పిండానికి చేయిచాపి చెరబండరాజు ఎర్రెర్రని స్మృతికి నేను ద్రోహంచేసేదిలేదు. చేతితోనేకాదు సరిగదా కొసకాలితోగూడా ఈ నీచపు సొమ్ముని ముట్టను. జీవించి ఉండగా ఎన్నో సార్లు జైలుకుపంపి ఉద్యోగం ఊడగొట్టి. కుట్రకేసులో ఇరికించి వేధిస్తూ, పరోక్షంగా ఆయన మెదడు వ్యాధికి కారణమైన ఈ ప్రభుత్వంతో దాని ఉపాంగాలైన అకాడెమీలాంటి తుచ్ఛ సంస్థలతో నాకు ఎలాంటి రాజీకూడాలేదు. ఏ పీడిత ప్రజలైతే చెరబండ రాజు కవిత్వాన్ని సాహిత్యాన్ని ఆదరించి, సొంతంచేసుకుని, ఆయనకు చేదోడు, వాదోడుగా నిలిచాడో ఏ ప్రజలకోసమైతే ఆయన రాసి పాడాడో అనుక్షణం పోరాడాడో, ఆ ప్రజల పేరిట, ఆ సాహిత్యం పేరిట, ఆ విప్లవం పేరిట నేను ఈ బహుమానాన్ని తోసి వేస్తున్నాను.

బి. శ్యామల.

---

ఇవన్నీ వాస్తవాలే, కాని ఈ వాస్తవాల కోసం వరంగల్ పత్రికా విలేఖరులను అడగకండి. మేధావులను ఖండించమనకండి. పోలీసుల "మొరేల్" దెబ్బతినగలదు. పత్రికలూ మేధావులూ సత్యాన్ని వెలికి తీయాలన్నది చాలా ఉన్నతమయిన విలువే. కాని పునాదులు కదులుతున్నప్పుడు ఈ విలువ లేవీ పోలీసుల మొరేల్‌కు సాటిరావు. తుపాకులతో తూటాలతో పునాదులను పునస్థాపించిన తరువాత అంతా చక్కబడ్డాక మళ్ళీ సత్యాన్వేషణ చేసుకుందాం. అప్పుడు మళ్ళీ అన్ని విలువలకూ స్వయంప్రతిపత్తి వస్తుంది. వర్గపోరాటానికి అతీత మయిన సార్వ జనీనత వస్తుంది. అంత వరకు – హెయిల్ హిట్లర్!

కె. బాలగోపాల్

# సాంస్కృతిక సమరరంగంలో రాజకీయ పాఠంగా ప్రజాసినిమా

జయధీర్ తిరుమలరావు గారు కొన్నాళ్ళ క్రితం ఓ ప్రముఖ వ్యాపార వారపత్రికలో అప్పుడు కొత్తగా అధికారంలోకి వచ్చిన సినిమా నటుడి ప్రభుత్వం గ్రామీణ సినిమాను ఎలా ప్రోత్సహించవచ్చో సూచిస్తూ ఒక ప్రబోధత్మక వ్యాసం రాశారు. ఇప్పుడు (సృజన, నవంబర్, డిసెంబర్, 1983) సుమారు అదే ధోరణిలో విప్లవ పార్టీలకు, ప్రజాసంఘాలకు "ప్రజా సినిమా" ఎలాతీయవచ్చో సూచిస్తూ మరొకవ్యాసం రాశారు.

సినిమాకు, తెలుగుసినిమాకు, సినిమాలలో "ప్రజాసినిమా" తీసే ప్రయత్నాలకీ ఒక చరిత్రఉంది. ఆ చరిత్రతో ఈ రచయితకు నిమిత్తం లేనట్టు తోస్తోంది. అయితే గత చరిత్రకంటె ముఖ్యమయిన వర్తమాన వాస్తవికత కూడా ఒకటుంది. అదికూడా ఆయన పెద్దగా పట్టించుకుంటున్నట్టులేదు. గ్రామాల సంగతటుంచి, పట్టణాలలో కూడా పౌరహక్కుల సంఘాలయినా కర పత్రంకూడా స్వేచ్ఛగా ప్రచురించుకునే అవకాశంలేని నిర్బంధ వాతావరణంలో ఆడియోవిజవల్ మీడియం శక్తివంతంకాబట్టి "పౌరహక్కుల సంఘాలు.... వెంటనే పూనుకోవాలి" అని సలహా ఇవ్వడం అర్థంలేనిపని. గడిచిన చరిత్ర తోనూ, నడుస్తున్న వాస్తవికతతోనూ నిమిత్తంలేకుండా ఊహల ఆకాశ హర్మ్యల్లో విహరించడం సినిమాల్లో సాధ్యమవుతుందేమోగాని, సామాజిక జీవితంలోకాదు.

— సురా.

# ఆర్ట్స్ కాలేజి ఆదేశం

చూడు మిత్రమా !
నీలో కంపించిన ఈ ఆర్తనాదం !
ఏ కవి హృదయాన్ని తట్టగలదు
ఏ రాజకీయవేత్త గుండెల్ని తాకగలదు,
ఏ పోలీసాఫీసరు లాఠీని ఆపగలదు
ఏ విద్యాలయాధికారి కళ్ళు విప్పగలదు
నీ ఆవేదన, నీ ఆక్రోశం నీకసి
ఈ సమాజం మీదనా కాదు వ్యవస్థ మీద
లాఠీతో పగిలిన తమ్ముడి ఈ తలకాయకు
తప్పుకోబోయి టెర్రేస్ మీంచి దూకిన ఆ తమ్ముడి విరిగిన
కాలు జవాబు !
ఒక తమ్ముడి చిందిన రక్తాన్ని
భూదేవి బుజ్జగిస్తుంది
మళ్ళీ విజృంభించమని ఏర్రపూలుగా వికసిస్తుంది
ఇక్కడ నీకు స్వాతంత్ర్యంలేదు, స్వేచ్ఛ లేదు
పోరాటం తప్ప బ్రతుక్కి మారే మార్గం లేదు
నీ చదువుకు జవాబు నిరుద్యోగం
నీ వడిగే ప్రశ్నకు జవాబు లాఠీ
నీ బ్రతుకుకు జవాబు బానిసత్వం
అందుకే తమ్ముడు ఉద్యమించు, విప్లవించు
మానవతా హృదయాల్ని ఆవిష్కరించు

ఉదయించే సూరీడు

# శ్రీకాకుళంలో అమరులైన ప్రజాకార్యకర్తలు

| | మృతవీరుల పేర్లు | వయస్సు | ఊరు | తేదీ |
|---|---|---|---|---|
| 1. | ఆరికె కోరన్న | | పలభగూడెం | 31-10-1967 |
| 2. | పడ్డిగ మంగన్న | | మామిడిగూడెం | 31-10-1967 |
| 3. | కేదరి (జాతాపు) | | పెదఖర్జ | 4-3-1968 |
| 4. | సింగన్న (సవర) | | ,, | 4-3-1968 |
| 5. | రెంటం | | గంగప్పదొర వలస | 13-2-1969 |
| 6. | రెడ్డి అప్పలస్వామి | 35 | నారాయణపురం | 17-3-69 |
| 7. | నిమ్మక సుక్కులు | | పురికి | 24-3-69 |
| 8. | కాంద్ర పురండు | | | 30-3-69 |
| 9. | పయిల భీముడు | 30 | మొండెంకల్లు | 26-5-69 |
| 10. | పంచాదికృష్ణమూర్తి | 35 | బొడ్డపాడు | 27-5-69 |
| 11. | దున్న గోపాల్‌రావు | 18 | ,, | ,, |
| 12. | నిరంజన్‌రావు | 14 | బరంపురం | ,, |
| 13. | శృంగవరపునరసింహులు | 52 | లక్కవరం | ,, |
| 14. | తామాడ చిన్నారావు | 15 | బొడ్డపాడు | ,, |
| 15. | బైనపల్లిపాపారావు | 18 | ,, | ,, |
| 16. | కంచారపుక్రిష్ణమూర్తి | 34 | మేదమత్రి | ,, |
| 17. | రామచంద్రప్రధాన్ | 32 | సల్లెల్లపుట్టుక | ,, |
| 18. | ధనుంజయరావు | 18 | పెద్దసాన | 9-7-69 |
| 19. | జె. చిన్నారావు | 19 | మామిడిపల్లి | ,, |
| 20. | బిడ్డిక అడ్డాయి | | చింతాలకొరిడి | 13-7-69 |
| 21. | తాబేలు నాయుడు | 60 | తులసిగూడ | జూలై 69 |
| 22. | ,, పుత్రుడు | 35 | ,, | ,, |
| 23. | ,, ,, | 24 | ,, | ,, |
| 24. | ,, ,, | 20 | ,, | ,, |
| 25. | ,, ,, | 18 | ,, | ,, |
| 26. | ,, ,, | 16 | ,, | ,, |
| 27. | ,, దళసభ్యుడు | | — | ,, |
| 28. | ,, దళసభ్యుడు | | — | ,, |
| 29. | ,, దళసభ్యుడు | | — | ,, |

| | | | | |
|---|---|---|---|---|
| 30. | కొండగొర్రి బంగయ్య | | కొండసిరిపి | 5-8-69 |
| 31. | పవరసుక్కు | 40 | అంతికొండ | 5-8-69 |
| 32. | నిమ్మకవెంకటస్వామి | 25 | అంతికొండ | ,, |
| 33. | సవరసన్యాసి | | ,, | ,, |
| 34. | కొండగొర్రి | | కొండసిరిపి | ,, |
| 35. | పాండిజగన్నాయకులు | 31 | నారాయణపురం | 20-8-69 |
| 36. | జగతిభైరి | 27 | జింకుభద్ర | ,, |
| 37. | నిమ్మకగుడాలు | | పురిడి | 24-8-69 |
| 38. | నిమ్మకసూరయ్య | 35 | అంతికొండ | - |
| 39. | నిమ్మకనాయకన్న | 50 | ,, | - |
| 40. | బిడ్డిక జమ్మడు | | తులసి | 7-10-69 |
| 41. | సథాలజోగులు | | కొండవాడ | 9-10-69 |
| 42. | కొండగొర్రికృష్ణుడు | | ,, | ,, |
| 43. | మండంగి నీలకంఠం | | ,, | — |
| 44. | అరిక తట్టడు | | ఊధమసుగడ | 15-11-69 |
| 45. | దున్నఅంకమ్మ | 23 | రాజాం | 22-11-69 |
| 46. | తెలకల సరస్వతి | 25 | బొడ్డపాడు | ,, |
| 47. | గొరకలసన్యాసి | 19 | నీలావతి | ,, |
| 48. | చాగంటిభాస్కరరావు | 34 | చాగంటిపాడు, గుంటూరు | ,, |
| 49. | గేదెలలోకనాధం | | బొడ్డపాడు | 28-11-69 |
| 50. | గార మాధవరావు | 26 | దున్నూరు | ,, |
| 51. | మురిపింటివల్లభరావు | 28 | మ్రిపాడు | 30-11-69 |
| 52. | పట్టిక చున్నాలు | 30 | నీలకంఠాపురం | 11-12-69 |
| 53. | అరిక మంగడు | | స్వడిగూడ | ,, |
| 54. | కొండగొర్రి ఎంకన్న | | బొడ్డమసుగడ | ,, |
| 55. | సుబ్బారావుపాణిగ్రాహి | 35 | బొడ్డపాడు | 22-12-69 |
| 56. | తామాడగణపతి | 35 | ,, | ,, |
| 57. | పంచాదినిర్మల | 22 | ,, | ,, |
| 58. | చెల్లూరి ఉమాపతి | 19 | రాజాం | ,, |
| 59. | రమేష్‌చంద్రసాహు | 26 | బరంపురం | ,, |
| 60. | సల్లుమ్‌గాడు | | గాడిదప్లైన్ | 6-1-70 |

| | | | | |
|---|---|---|---|---|
| 61. | కురంగిమల్లయ్య | 35 | గాడిదఫైన్ | 11-1-70 |
| 62. | సూరు | | — | ,, |
| 63. | ఓడ్డక అబ్బాయి | | సాఖి | ,, |
| 64. | యం.వి. రమణమూర్తి | 35 | బాదవలస | 13-6-70 |
| 65. | జుత్తు ఉమాపతి | 22 | చిన్నసీలావతి | 14-6-70 |
| 66. | వెంకటాపుసత్యనారాయణ | 40 | బూర్జువలస | 10-7-70 |
| 67. | ఆదిభట్ల కైలాసం | 40 | కార్యవలస | ,, |
| 68. | దుమ్ము అప్పలస్వామి | | బొడ్డపాడు | 30-7-70 |
| 69. | ఉర్లాం మల్లేశ్వరరావు | 22 | పెదనీలావతి | ,, |
| 70. | దేవినేనిమల్లికార్జునుడు | 28 | నన్నంపుడి, నెల్లురుజిల్లా | ,, |
| 71. | గుమ్మడి లచ్చయ్య | 40 | కొమర్తి | 1970 |
| 72. | పుచ్చ అప్పలస్వామి | 33 | చినసీలావతి | నవంబరు 1970 |
| 73. | మండలి సంగమేశు | | గౌరంపేట | ,, |
| 74. | నవరరాము | 17 | మహేంద్రగిరి, సోంపేట | 30-6-71 |
| 75. | రొహిదాస్ గుండంగో | | ,, | 30-8-71 |
| 76. | పోతనపల్లి అప్పారావు | 20 | బొడ్డపాడు | ,, |
| 77. | సొల్లు | 29 | ఆవిరి | - |
| 78. | నవరజమ్మడు | 45 | బొడ్డనబుడుగు | - |
| 79. | వావిలపల్లిసత్యనారాయణ | 38 | ఉత్తరపల్లి | - |
| 80. | పొందలబాలకృష్ణ | 25 | రిట్టపాడు, టెక్కలి తా. | 8-9-71 |
| 81. | రెడ్డిచిన్నమనాయుడు | 32 | కొమరాడ | 1971 |
| 82. | మదనాల దుష్యంత్ | 26 | బొడ్డపాడు | — |
| 83. | కురంగి సుందరి | 23 | గాడిదఫైన్ | |
| 84. | అడ్డాకుల చిరంజీవులు | | అంతికొండ | |
| 85. | కొండగౌరి సంగమేశు | | ,, | |
| 86. | రాజారాంరెడ్డి | 25 | నెల్లూరు | 9-2-73 |
| 87, | అప్పలస్వామి | | శ్రీకాకుళం | 4-9-73 |
| 88. | అరికెసోములు | | ,, | ,, |
| 89. | బ్రహ్మారెడ్డి | 21 | విజయవాడ | — |
| 90. | కొమరు | 50 | తాడిపాయిగూట, పాలకొండ తా॥ | - |
| 91. | నూకన్న | | పెదగూడ | - |

(ఆధారం : 1. అమరవీరుల జీవితచరిత్రలు - పిలుపు ప్రచురణ, హైదరాబాద్-1973. 2. సృజన-డిసెంబర్ 1973 సంచిక 51)

# ఎన్. టి. రామారావు ఒక సంవత్సరం పాలన ప్రోగ్రెస్ రిపోర్ట్!

* పోలీసు కాల్పుల్లో 10 మంది చనిపోయారు.
* పోలీసు "ఎన్‌కౌంటర్"లలో ముగ్గురు చనిపోయారు.
* ఏడుగురిని భూస్వాములు హత్యచేశారు.
* రాష్ట్రంలో 125 సాయుధ పోలీసు క్యాంపులు ఏర్పాటు చేశారు.
* 310 గ్రామాలపై పోలీసులు దాడులు చేశారు.
* 49 సర్వీసులను అత్యవసర సర్వీసుల చట్టం కిందికి తెచ్చారు.
* ఆరుగురిని జాతీయ భద్రతాచట్టంకింద నిర్బంధించారు.
* మొత్తం 24 లక్షల 85 వేల మంది ప్రజలు కల్లోలిత ప్రాంతాలలో నివసిస్తున్నారు.

పూర్తి వివరాలకు కోసం చదవండి :

ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం, ఢిల్లీపీపుల్స్ యూనియన్ ఫర్ డెమొక్రటిక్ రైట్స్

ఇంగ్లీషు ప్రచురణ

**NTR's ONE YEAR**

**A Report on the Democratic Rights in A. P.**

వెల : రు. 2-00

పౌరహక్కుల సంఘం ప్రచురణ

**Repression on the Rural poor in A. P.**

వెల : రు. 2-00

---

తాజాకలం : తెలంగాణజిల్లాల్లో సి.ఆర్.పి. దిగింది. కరీంనగర్ జిల్లా మహదేవపూర్ తాలూకా బోర్లగూడెం గ్రామంలో లంబాడీ యువకుడు జర్పుల అగ్రము నాయక్‌ను సి ఆర్ పి జవాన్లు హత్యచేశారు- సి ఆర్ పి వల్ల రాబోయే పరిణామాలకు ఇది నిదర్శనం.

1984 ఫిబ్రవరి 25, 26 శని, ఆదివారాలలో

# గడ్‌చిరోలి జిల్లా ఆదివాసీ రైతుకూలీ సంఘటన ప్రథమ మహాసభ

గత మూడు సంవత్సరాలుగా మహారాష్ట్రలోని గడ్‌చిరోలి జిల్లా సిరొంచ, అహిరి మొదలయిన తాలూకాల్లోనూ, ఆ ప్రాంతానికి ఆనుకొని ఉన్న మధ్యప్రదేశ్‌లోని బస్తర్ జిల్లాలోనూ అనేక గ్రామాల ఆదివాసీ రైతుకూలీలు సంఘాలు ఏర్పరచుకొని ఫారెస్టు అధికారుల దోపిడీ దౌర్జన్యాలను ఎదిరించి తలఎత్తి నిలబడి పోరాటాలకు తలపడుతున్నారు. ఆదివాసి ప్రజానీకంలోవచ్చిన ఈ కదలికకు బెదిరిపోయిన ప్రభుత్వం అక్రమ కేసులతో, అరెస్టులతో ప్రజల్ని హింసిస్తోంది- రైతాంగ కార్యకర్తలను పట్టి ఇవ్వవలసిందిగా పోలీసులు ప్రజలపై ఒత్తిడి తెస్తున్నారు. అయితే ఆదివాసీ రైతుకూలీ ప్రజానీకం ఈ పోలీసుల నిర్బంధాన్ని ధైర్యంగా ఎదుర్కొంటూ నిబ్బరంగా తమ పోరాటాన్ని ముందుకు తీసుకుపోతూంది.

గడ్‌చిరోలి, సిరొంచ, బస్తర్ ప్రాంతాలలో ఆదివాసీ రైతుకూలీల పోరాటాలకు చేయూత నివ్వండి. రైతుకూలీ ఉద్యమంపై ప్రభుత్వాలు అమలు చేస్తున్న నిర్బంధ కాండను, దమనకాండను గొంతెత్తి ఖండించండి. ఫిబ్రవరిలో జరిగే ఆదివాసీ రైతుకూలీ సంఘటన జిల్లా మహాసభను జయప్రదం చేయండి.

